# క్యాంపస్ వాయిస్

సామాజిక, రాజకీయ, ఆర్థిక మాస పత్రిక

వెల : 10/-

సంపుటి : 2 సంచిక : 2 మార్చి 2011









- ఈజిప్టు నియంతృత్వం
- ట్యూనిషియాలో ప్రజావెల్లువ
- శ్రీకృష్ణ కమిటీ కాదు దుగ్గల్ కమిటీ
- చరిత్రలో మహిళా దినోత్సవం
- దళితుల తొలి విప్లవ పోరాటం

# క్యాంపస్ వాయిస్

సామాజిక, రాజకీయ, ఆర్థిక మాసపత్రిక

సంపుటి : 2 సంచిక : 2 మార్చి 2011




## సంపాదకీయం

# అవినీతిపై "యుద్ధం"

అవినీతి, అక్రమార్జనలు నేడు జీవిత విధానంగా మారాయి. సామాన్య ప్రభుత్యోగివద్ద కొన్ని కోట్ల రూపాయల నల్ల ధనం బయటపడిన వార్తలు ఎంత తరచుగా వస్తున్నాయో రాజకీయ అధినేతల నిర్ణయాలతో లక్షలకోట్ల ప్రజాధనాన్ని బడాబుర్జువాలు కొల్లగొడుతున్న అక్రమార్జన పర్వాలు అంత తరచుగా పత్రికల కెక్కుతున్నాయి. నేటి ప్రధాని ఆర్థిక మంత్రిగా నూతన ఆర్థిక విధానాలను ప్రవేశపెట్టిన 1991లో 35 కోట్ల మంది భారతీయులు దారిద్ర్యరేఖకు దిగువనుండగా, నేటికి 45 కోట్ల మంది దారిద్ర్యంలో కూరుకుపోయారు. కాగా ఈ కాలంలో 10 శాతంగా వున్న భారత ధనికుల ఆస్తులు వందరెట్లకు పెరిగాయి. దీనిలో సింహభాగం 300 కుటుంబాలు లేదా గ్రూపులకే చేరింది.అది చట్టబద్దంగా. అక్రమంగా అయితే 2001-2008 మధ్యకాలంలో విదేశీ బ్యాంకులోకి చేరిన నల్లధనం 84 వేల కోట్ల రూపాయలు. అంటే ఈ అక్రమార్జనే లేకపోతే 10 కోట్లమంది దారిద్ర్యంలోకి చేరేవారు కాదు. దేశ సంపదను ప్రవాహంలా తరలించేసి గ్రామాలలో మహిళలకు మరుగుదోడ్డి నిర్మించేందుకు కూడా నిధులు లేవంటూ విదేశాలకు బొచ్చెపట్టుకు వెళ్లటాన్నే తన ఘనకార్యంగా చెప్పుకునే సిగ్గుమాలిన దశకు దేశాన్ని చేర్చారు.

మెక్‌కిన్సీ అన్న విదేశీ సలహాదారు కంపెనీ 2010 నవంబరులో రూపొందించిన నివేదికలో భారత ప్రభుత్వం చేస్తున్న వ్యయంలో అక్రమార్జన ఏడాదికి 18 బిలియన్ డాలర్లు (81 వేల కోట్ల రూపాయలు) అని అంచనా వేసింది. ఈ అక్రమార్జనలే లేకపోతే భారత పేద ప్రజల అదాయం ఏడాడికి 20 శాతం పెరిగి ఉండేవి. ఐదేళ్ళలో వారి ఆదాయం రెట్టింపై పేదరికం నుండి బయటపడి వుండేవారు. ఈ అవినీతి అక్రమార్జనల్లో మునిగితేలిన నేతలందరూ నేడు అవినీతిపై యుద్ధాన్ని ప్రకటిస్తున్నారు. ప్రజాధనాన్ని కొల్లగొట్టి బలిసిన పరిశ్రమాధిపతులందరూ అవినీతిని అదుపుచేసేందుకు ప్రభుత్వానికి సూచనలందజేస్తున్నారు. తాను తప్ప తక్కిన వారందరూ అవినీతి పరులేనన్న చందంగా మాట్లాడుతున్నారు. మచ్చలేని గురివిందలుగా చెలామణీ కాజూస్తున్నారు. స్విస్ బ్యాంకుల్లో దాచిన నల్లధనాన్ని దేశసంపదగా ప్రకటించి, అక్రమార్జన పరులను శిక్షించాలన్న తక్షణ డిమాండుతో పోరాడేందుకు ప్రజలు సంసిద్ధపడి సాగినప్పుడే అవినీతికి ముగింపు సాధ్యమౌతుంది. ప్రజా జీవనంలో సుఖశాంతులు నెలకొంటాయి.

- సంపాదకులు

లోపలి పేజీల్లో......





*రచనలు, అభిప్రాయాలు, చందాలు పంపవలసిన చిరునామా*

*ఎడిటర్*

క్యాంపస్ వాయిస్

రూం.నెంబర్ 34,నర్మద హాస్టల్ (NRSH)

ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్ - 500 007

Phone No. 8143606566, 9848384683, 9640475782

email:oucampusvoice@gmail.com Blog : www.oucampusvoice.blogspot.com

*Printed at :* Parthasarathi Art Printers Pvt. Ltd., Hyderabad. Ph : 66108206

# ఈజిప్టు : నియంతృత్వం, నయా ఉదారావాదాలపై తిరుగుబాటు

ప్రొ॥ ఎం. చెన్నబసవయ్య

అరబ్ ప్రపంచం, తూర్పు ఆఫ్రికా, పశ్చిమాసియాలు ముందెన్నడు చూడని ప్రజావెల్లువలతో పెల్లుబుకుతున్నాయి. మొదట గత డిసెంబరులో టునీషియాలో మొదలై ఆ దేశాధక్ష్యుడిని పదవీచ్చుద్యుడిని గావించి, తరువాత ఈజిప్టుకు పాకి అక్కడి దేశాధ్యక్షుడు హోస్నీముబారక్ 30 ఏండ్లపాలనను అంతం చేసి ప్రస్తుతం లిబియా అధక్ష్యుడు కల్నల్ గడాఫీ సుదీర్ఘపాలనను తుదముట్టించే దిశగా సాగుతున్నాయి. ప్రజాఉద్యమాల తాకిడి మిగతా అరబ్బు దేశాలు, మొరక్కో, బహ్రైన్, జోర్డాన్, యెమెన్‌లను సైతం వణికిస్తున్నాయి. ఈ పరిణామాలన్నింటికి మూల కారణాలు ఈ దేశాలలో బాగా పెరిగిన నిరుద్యోగం, ఆహార ద్రవ్యోల్బణం, అవినీతి, ఆశ్రిత పక్షపాతం, సుదీర్ఘ నియంతృత్వపోకడలు, మానవహక్కుల ఉల్లంఘనలు, కనీస స్వేచ్ఛా స్వాతంత్రాలను కాలరాయడం మొదలగునవిగా విమర్శకులు భావిస్తున్నారు. ఈజిప్టు అరబ్బుదేశాలలో జనాభా రీత్యా (7కోట్ల 90 లక్షలని అంచన) పెద్దది. ఆదేవిదంగా అరబ్బు రాజకీయాలలో కూడా ప్రముఖపాత్ర వహిస్తున్నది కూడా ఈజిప్టే. ఇంత ప్రాముఖ్యతగల ఈజిప్టులో ఈ పరిణామాలు సంభవించడానికి గత కారణాలేమిటి? అవి ఎట్లా మొదలైనాయి? ఉద్యమాలు సాగిన తీరు ఏమిటి? మొదలగు అంశాలను అర్థంచేసుకునే ప్రయత్నం చేద్దాం.

**ముబారక్ రాజకీయ పాలన సంస్కృతి:**

ఈజిప్టు గణతంత్ర రాజ్యంగా (1953) ఏర్పడిన తరువాత 1954 నుండి 1970 వరకు గమాల్ అబ్దుల్ నాజర్ పాలన కొనసాగింది. 1970 నుండి 1981 వరకు అన్వర్ సాదత్ అధ్యక్షుడిగా ఉండినాడు. ఇతని కాలంనుండే స్వతంత్ర, జాతీయవాద, అలీనవిధాన రాజకీయ భావాలకు తిలోద కాలియ్యడం ప్రారంభమైంది. అమెరికా అనుకూల విధానాలు మొదలైనాయి. వీటిలో భాగంగానే 1977లో సాదత్ ఇజ్రాయిల్ పర్యటించినాడు. అమెరికా సూచనల అనుగుణంగా 1979లో ఇజ్రాయిల్‌తో శాంతి ఒప్పందం (క్యాంప్ డేవిడ్ ఒప్పందం) కుదుర్చుకోవడం జరిగింది. 1981లో సాదత్ ఒక సైనికుని చేతిలో హత్యకు గురైన తర్వాత హోస్నీ ముబారక్ అధికారంలోకి వచ్చినాడు.

గత 30 ఏండ్లుగా ముబారక్ పాలన రాజకీయ 'స్థిరత్వం' ముఖ్య లక్షణంగా కొనసాగింది. ముబారక్ 'స్థిరత్వ' వాదం ఈజిప్టును మత ఛాందసల నుండి, తీవ్రవాదాల నుండి, ప్రాంతీయ రాజ్యాల ముప్పునుండి (ముఖ్యంగా ఇజ్రాయిల్) నివారించడం, అలాగే అంతర్గతంగా తలెత్తే ఎట్లాంటి వ్యతిరేకతలనైనా ఆదిలోనే అణచివేయడం, వీటికి పాల్పడ్డవారిని భయపెట్టడం, కఠినంగా శిక్షించడంలాంటివి 'స్థిరత్వం" విధానంలో భాగమే. విదేశాంగ విధానపరంగా చూస్తే అమెరికా సూచించిన ఇజ్రాయిల్-పాలస్తీనా 'శాంతి' ప్రక్రియను, అమెరికా తీవ్రవాదంపై యుద్ధ ప్రకటనను సమర్థించడం, దాని అనుకూలంగా నడుచుకోవడం కూడా 'స్థిరత్వ' వాదంలోని అంశాలే. అందువల్ల అమెరికా ఇతర పాశ్చాత్య పెట్టుబడిదారి దేశాలు ముబారక్‌ను సమర్థిచండమే కాకుండా, ఆర్థిక, మిలటరీ పరంగా కూడా మద్దతునిస్తూ వచ్చారు. మొత్తంగా చూస్తే 'స్థిరత్వ' వాదంలో భాగంగా తన ప్రభుత్వాన్ని రక్షించుకోవడానికి అవసరమైన మిలటరి, పోలీసు, ఇతర భద్రతా వ్యవస్థలపై ప్రాధాన్యత ఎక్కువగా ఇవ్వడం జరిగింది. అందువల్ల ఈజిప్టు పౌరసమాజంలో పోలీసు, ఇతర భద్రతా వ్యవస్థలు విపరీతంగా చొచ్చుకుపోయినాయి. యూనివర్సిటీలు, అన్ని రకాల ప్రభుత్వ ఇతర సంస్థలలో ప్రత్యక్షంగా, పరోక్షంగా రాజ్య భద్రతాసిబ్బంది జోక్యం, పర్యవేక్షణ విపరీతంగా వుండి ప్రభుత్వ వ్యతిరేక వాదనలు, విమర్శలు, ఇతర పౌర స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, కాలరాచబడినాలు. గత 30 సంవత్సరాలుగా అపఖ్యాతిగాంచిన అత్యవసర పరిస్థితి చట్టం నిరంతరంగా కొనసాగుతూ వచ్చింది.



ముబారక్ రాజకీయ 'స్థిరత్వాన్ని' కాపాడేందుకు, దానికి ఎదురయ్యే ఎటువంటి సవాళ్ళనైనా ఎదుర్కోనెందుకు పోలీసు వ్యవస్థకు అపరిమిత అధికారాలివ్వబడ్డాయి. అందువల్ల పోలీసు ప్రవర్తన మితిమీరి అమాయకులు సైతం వారి వేధింపులకు గురికావడం ఈజిప్టు సమాజంలో పరిపాటిగా మారింది. గత 30 సంవత్సరాలుగా జరిగిన ఎన్నికలన్నీ ఏమాత్రం స్వతంత్రంగా నిర్వహించబడలేదు. అన్నీ కూడా ప్రభుత్వ, పోలీసు వ్యవస్థ జోక్యంతో జరుపబడినాయి. అంతెందుకు జనవరి ప్రజాఉద్యమానికి కేవలం రెండు నెలల క్రితం అనగా నవంబరు 2010 పార్లమెంటు ఎన్నికలు జరుగగా దానిలో అధికార నేషనల్ డెమోక్రాటిక్ పార్టీ 93 శాతం సీట్లు పొందింది. అంతకు ముందున్న పార్లమెంటులో 20 శాతం సీట్లున్న ప్రధాన ప్రతిపక్షం 'ముస్లిం బ్రదర్స్' కు ఒక్క సీటు కూడా రాలేదు. ఇతర ప్రతి పక్షాలన్ని కలిపి కేవలం 6 సీట్లుకావడం చూస్తే ఎన్నికలు ఎంత స్వతంత్రంగా జరిగినాయో సులువుగా అర్థమౌతుంది. నిజంగా గనుక ముబారక్ ప్రభుత్వానికి 93 శాతం సీట్లు ఇచ్చే ప్రజాధరణే వుంటే రెండు నెలల్లోనే ఇంత వ్యతిరేక ప్రజా ప్రభంజనం ఎందుకు వస్తుంది అనే అనుమానాలు ఎవరికైనా కలగక మానవు. కావున ఇవన్నీ కూడా రాజ్యహింస ద్వారానే కొనసాగినాయి అని అర్థం చేసుకోవాలి.

**నయా ఉదారావాద ఆర్థిక విధానాలు:**

ముబారక్ ప్రభుత్వం పైన తెలిపిన అప్రజాస్వామిక, నియంతృత్వ అణచివేత విధానాలు కప్పిపుచ్చుకోవడానికి మొదటి నుండి 'అభివృద్ధి' మంత్రాన్ని జపిస్తూ వచ్చింది. ఇతర ఉత్తర ఆఫ్రికా ఆరబ్బుదేశాలతో పోలిస్తే ఈజిప్టు అభివృద్ధిలో, విదేశీ పెట్టుబడుల ఆకర్షణలో ముఖ్యంగా ప్రపంచీకరణ పద్ధతులైన ప్రైవేటీకరణ రంగాలలో ఈజిప్టు ఇతర దేశాలకు అనుసరణీయ దేశంగా మారిందని దేశపు ఆర్థిక మంత్రి యూసుఫ్ బుత్రోస్ ఘలి (మాజీ అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (IMF) ఆర్థిక శాస్త్రవేత్త) 2010 నవంబరులో వాషింగ్టన్ పోస్టు పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో పేర్కొన్నారు. ఇవన్నీ ఈజిప్టు సమాజపు ఉన్నత వర్గపు దృష్టితో చూసినపుడు వాస్తవలేమో కాని సాధారణ ప్రజానీకం దృష్టితో చూసినప్పుడు వాస్తవ విరుద్ధాలు. ముఖ్యంగా 1990 నుండి అమలు కాబడిన నయా ఉదారావాద విధానాలు ఆర్థిక రంగంలో రాజ్య నియంత్రణ గణనీయంగా తగ్గింపు, ప్రవేటీకరణ, దేశ, విదేశీ ప్రయివేటు పెట్టుబడి అనుకూల విధానాలు, పన్నులు ఇతర సరళీకరణ 'సంస్కరణలు' స్వేచ్ఛ విఫణి వ్యాపార ప్రోత్సాహకాలు అన్ని కలిసి దేశపు ఆర్థిక వృద్ధిరేటును పెంచినాయి కాని సమాజంలోని ధనిక, పేద వర్గాల మధ్య అసమానతలను రూపుమాపకపోగ మరింత పెంచినాయి. ఈ విధానాలన్ని కూడా పాలకులు, సంపన్న వర్గాల ఆస్తుల పెంపుదలకు దోహదపడ్డాయి.

ఈ విధానాలు నాజర్‌కాలం, కొంతమేరకు సాదత్‌కాలంలో అమలైన జాతీయ, స్వయంసమృద్ధి ప్రజాసంక్షేమాభివృద్ధి విధానాలను పూర్తిగా పూడ్చిపెట్టినాయి. తద్వారా ప్రపంచబ్యాంకు లెక్కల ప్రకారమే (అంతకు మునుపులేని) 40 శాతం ఈజిప్టు ప్రజలను దారిద్ర్యారేఖకు దిగువన నెట్టివేసినాడు. మొత్తం జనాభాలో సగానికి పైచిలుకు వున్న 25 సంవత్సరాలలోపు యువత పెద్ద ఎత్తున నిరుద్యోగ సమస్యను ఎదుర్కొంటున్నది. సామాన్య ప్రజానీకం పూటగడవటమే సాధ్యంకాని పరిస్థితి నెట్టబడ్డారు. దీనికి భిన్నంగా పాలకవర్గం, వ్యాపార సంపన్న వర్గాల వారు మట్టుకు అవినీతి కార్యకలపాలు సాగించి ప్రభుత్వ భూములు, అంతకుముందు సమిష్టి ఆస్తిగావున్న భూములు, ఆస్తులు తమపరం చేసుకున్నారు. అభివృద్ధి మంత్రంలో భాగంగా కృత్రిమ మార్కెట్టు, రియల్ ఎస్టేటు వ్యాపార విజృంభణలు సృష్టించి సాధారణ ప్రజానీకపు భూములు, ఆస్తులను సైతం తమ ఆధిపత్యంలోకి తీసుకున్నారు. ఇవన్నీ కూడా ప్రభుత్వ, 'సుస్థిరత', 'అభివృద్ధి' పేరిటనే జరుగుతూ వచ్చినాయి. ఈ విధంగా రాజకీయపరంగా నియంతృత్వ విధానాలు, ఆర్థికపరంగా నయా ఉదారావాద విధానాలు ఈజిప్టు సమాజపు మధ్యస్థాయి మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి, ఇతర సాధారణ ప్రజానీకాలను పలురకాల ఇబ్బందులకు గురిచేస్తూ ప్రభుత్వం పట్ల వ్యతిరేకతను పెంపొందిచడానికి దోహదపడినాయి.



**జనవరి ప్రజా వెల్లువ మూలాలు:**




ఈజిప్టులో జనవరిలో ప్రజ్వరిల్లిన ప్రజావెల్లువ ఆకస్మికంగా వచ్చింది కాదు. దీని మూలాలు దశాబ్దకాలం ముందునుండే చూడవచ్చును. పైన పేర్కొన్న విధానాల ఫలితంగా ఈజిప్టు సమాజంలో ప్రభుత్వ వ్యతిరేకత ప్రజలలో చాపకింద నిరులాగా పెరుగుతూ వచ్చింది. ముబారక్ తన తనయుడు, గామల్ ముబారక్ (ప్రముఖ బ్యాంకింగ్ రంగ అధిపతి) తన వారసునిగా ప్రకటించడంతో వివిధ వర్గాలలో వున్న ప్రభుత్వ వ్యతిరేకత సంఘటితం కావడానికి దోహదపడింది. పలు వ్యతిరేక గ్రూపులు, ప్రచార ఉద్యమాలు కలిసి 2004లో "కెఫాయ ఉద్యమం" (ఈజిప్టు మార్పు ఉద్యమం) గా రూపాంతరం చెందినాయి. కెఫాయ ఉద్యమం ప్రత్యేకత ఏమిటంటే పలు రంగుల, భావాల ప్రభుత్వ వ్యతిరేక గ్రూపులన్నింటిని (ఇస్లామిస్టులు, కమ్యూనిస్టులు, లౌకిక సామ్యవాదులు, ఇతర ప్రజాస్వామ్యవాదులు) ఒక్క త్రాటిమీదికి తీసుకురావడం, 2004-2007 మధ్యకాలంలో కెఫాయ ఉద్యమం అంసఖ్యాక ప్రజా ప్రదర్శనలను నిర్వహించింది. 2007లో మొదటిసారిగా ఆశ్రిత పక్షపాతి ముబారక్ వైదొలగాలని పిలుపునిచ్చింది. ఈ విధంగా ఈజిప్టులో వీది ఉద్యమాలు రూపొందించడంలో అన్ని రకాల ప్రభుత్వ వ్యతిరేక శక్తులను వాటిలో భాగస్వాములుగా చేయడంలో కెఫాయ ఉద్యమం రాజ్యహింసను ఎదుర్కొని ముందుకుపోగలిగింది.

కెఫాయ ఉద్యమాన్నికి తోడుగా చదువరులైన మధ్యస్థాయి మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి యువతీ,యువకులు ఇంటర్నెట్ ద్వారా ఒక విన్నూత యధార్థ ప్రజాక్షేత్రాన్ని (Virtual public Sphere) ఆవిష్కరించింది. కెఫాయ ఉద్యమంలో పాల్గొంటున్న యువత తమ బ్లాగుల ద్వారా ప్రచారం మొదలు పెట్టినారు. బ్లాగర్ల సంఖ్య పదుల నుండి మొదలై వందల వేల కొలదిగా మారింది. వీరంతా తమ తమ బ్లాగులలో ప్రభుత్వ విధానాలను వివిధ స్థాయిల ప్రజానీకం ఎదుర్కొంటున్న సమస్యలను ముబారక్ నియంతృత్వ, అణచివేత, ఆశ్రిత పక్షపాత సంఘటనల, విధానాలను ఎండగట్టడం, వాటిపై చర్చలు కొనసాగించటం మొదలు పెట్టినాయి. ఇవన్ని కూడా వీధి ప్రదర్శనల, ఇతర గ్రామీణ ఉద్యమాలలో ప్రజలను భాగస్వాములు చేయడంలో తమ వంతు పాత్రను నిర్వహించినాయి. ముఖ్యంగా ప్రభుత్వ చట్టాలకు నిలదొక్కుకోలేని ఇతర మీడియాలలో ప్రత్యక్షం కాని సంఘటనలు, కేసులను బ్లాగులలో ప్రత్యక్షం చేసినాయి. ఉదాహరణకు వాయెల్ అబ్బాస్ అనే ఒక బ్లాగర్ తాను నిర్వహించే "ఆల్ వాయి ఆల్ మస్రీ" (ఈజిప్టు మేలుకొలుపు) అనే బ్లాగులో ఒక కైరో నగర పోలీసు స్టేషన్‌లో ఒక సాధారణ యువకుడు ఏవిధంగా శారీరకంగా, లైంగికంగా చిత్రహింసక గురైనాడో వీడియో ద్వారా చూపినాడు (దీనిని పోలీసులలోనే ఒక ప్రత్యర్థి ఆఫీసరు తన ఫోనులో చిత్రికరించి ఇచ్చినారని సమాచారం)

ఈ విధంగా మీడియాలలో రాకుండా నియంత్రించిన ఎన్నో సంఘటనలు, కేసులు బ్లాగులలో, యూట్యూబ్ వీడియోలలో ప్రత్యక్షమౌతూ వచ్చాయి. వీటిని రూపొందించడం, ప్రచారం చేయడంతో ముఖ్యంగా యూనివర్సిటీ స్థాయి విద్యార్థులు, యువకులు, పాత్రికేయులు, లాయర్లు ప్రధాన పాత్ర పోషించినారు. బ్లాగులకు తోడుగా 2008 నుండి "ఫేస్‌బుక్" ప్రచారం, చర్చలు తోడయ్యి యధార్థ ప్రజాక్షేత్ర ఉద్యమాన్ని మరింత బలోపేతం చేసినాయి. ఈజిప్టులో చాల ఏండ్ల తరువాత 2008 ఏప్రిల్ 6న ఒక రోజు సాధారణ సమ్మె విజయవంతమైంది. దీనిలో కార్మికులు, విద్యార్థులు, యువతీ యువకులు ఇతర సాధారణ ప్రజానీకం అత్యధిక సంఖ్యలో పాల్గొన్నారు. ఈ సాధారణ సమ్మె అంత విజయవంతం కావడానికి ముఖ్యకారణం కైరో నగరం వెలుపల నివసించే ఎస్రా అబ్ అల్‌ఫతా అనే యువతి ఫేస్‌బుక్ ద్వారా ప్రచారం చేయడం. ఈ సాధారణ సమ్మెను ఫేస్‌బుక్‌లో పెట్టిన రెండు వారాలలో 70 వేల మంది ఎస్రా ప్రయత్నానికి సానుకూలంగా స్పందించి సాధారణ సమ్మెలో పాల్గొనడం జరిగింది.

ఈ విధంగా కెఫాయ ఉద్యమం, బ్లాగ్‌లు, ఫేస్‌బుక్ ఆవిష్కరించిన యధార్థ ప్రజాక్షేత్ర ఉద్యమాలు కొలది సంవత్సరాలుగా ఈజిప్టు ప్రజలలో 1) ముబారక్ పాలన ను వ్యతిరేకించడం, అతడ్ని గద్దెదించడం, 2) ముబాగక్ ఆశ్రిత పక్షపాతంతో తన కొడుకు గమాల్ ముబారక్‌ను "తద్‌రిత్",

(వారసత్వం) గా అధికారంలోకి తీసుకొనివచ్చే ప్రయత్నాలను ఎండగట్టడం, 3) ఈజిప్టులో ప్రజాస్వామ్య హక్కులకు, స్వేచ్ఛకు స్థానం కల్పించడం, 4)నిరంకుశ రాజ్యహింసను అన్ని స్థాయిలలో నిరోధించడం అనే అంశాలపై ప్రజా చైతన్యాన్ని పెంచడంలో సఫలీకృతమైనాయి. ఈ ప్రయత్నాలలో విజయవంతమైన ట్యూనిషియా "మల్లెపూవు విప్లవం" ప్రేరణ కలిగించింది. జనవరి 25 నుండి ఫిబ్రవరి 11 వరకు కైరో నగరంలో ప్రధాన "తెహరీర్ చౌక్" లో ఆమోఘమైన ప్రజా ప్రభంజనను విజయవంతం చేసినాయి. తెహరీర్ చౌక్‌లో లక్షలాది గొంతుకలు నినదించిన ప్రధాన నినాదం "ఆల్-శాబ్ యూరిద్ ఇస్కాత్ అల్ నిజాం" (అశేష ప్రజాభీష్టం మేరకు ఈ ప్రభుత్వం వైదొలగాలి) నిజమైంది. ఫిబ్రవరి 11న హోస్నీ ముబారక్ పదవీచ్యుత్యుడైనాడు. తాత్కాలిక అధికార పగ్గాలుచేపట్టిన ఉన్నతస్థాయి సైనిక మండలి (The Supreme Council of Armed Forces) పార్లమెంటును రద్దు చేసింది. రాజ్యాంగాన్ని అచేతనం చేసింది. (Suspend) వచ్చే జూన్ మాసంలో పార్లమెంటుకు ఎన్నికలు నిర్వహించడం జరుగుతుందని ప్రకటించింది.

**ముగింపు:**

ఈజిప్టు ప్రజల విజయం చరిత్రలో మరో మారు తెలియజేసిందేమిటంటే "అశేష ప్రజాక్రోషం ముందు ఎంతటి నియంతలైనా నిష్క్రమించక తప్పదు". అయితే ఈ ప్రజా విజయం ఈజిప్టు మెజారిటి సాధారణ ప్రజల కలలను ఎంతమేరకు నిజం చేయగలదు అనే అంశాలను ముందుకు తెస్తున్నది. ముబారక్‌ను గద్దెదించడానికి ఏకమైన పలు ప్రభుత్వ వ్యతిరేక గ్రూపులకు పలు పరిమితులున్నాయి. భాగస్వామ్యమైన పలు పక్షాలు కార్మిక సంఘాలు, విద్యార్థి, యువత సంఘాలు, బ్లాగర్లు, రాజకీయపార్టీలు, ఇస్లామిస్ట్ సంస్థలు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఇతర ప్రజాస్వామ్య సంస్థలు, అన్నింటికి వేరు వేరు డిమాండ్లు వున్నాయి. వాటి సంస్థగత కార్యకాలాపాలు వేరు వేరుగా వున్నాయి. వీరందరికి మధ్య అర్థవంతమైన చర్చలు జరుగుతాయా అనే అనుమానాలున్నాయి. వీరందరి మధ్య చర్చలు జరగాల్సిన అవసరముంది. అవి ఫలప్రదం కావాలంటే ఎవరికివారు కాకుండా ఒక అర్థవంతమైన సంసాగతపరమైన చర్చలు కొనసాగాలి, వాటికి అనుకూలమైన వాతావరణం ఏర్పరచాడానికి అన్ని శక్తులు కృషి చేయాలి. వీటన్నింటిని సాగదీయడం జరుగకుండా ఒక కాలపరిమితిని కూడా నిర్ధారించాలి. అంతరగ్గతంగా పరిస్థితులు ఈ విధంగా వుండగా ఇంతవరకు తమ ఆసక్తులకనుగుణంగా మసలిన ముబారక్‌ను సమర్థించిన అమెరికా, ఇతర పాశ్చాత్య పెట్టుబడిదారి దేశాలు మరల తమ ఆసక్తుల కొనసాగింపుకు పావులు కదుపుతున్నాయి. అమెరికా ఉప విదేశాంగశాఖ అండర్ సెక్రెటరి (రాజకీయ వ్యవహారాల విభాగం) విలియం జె.బర్న్ కైరో వెళ్ళి ప్రభుత్వ అధికారులతో, ఉద్యమంలో పాల్గోన్న పలు సంస్థల ప్రతినిధులతో ఇతర పౌరసమాజ ప్రతినిధులతో మంతనాలు మొదలుపెట్టినాడు. ఇంగ్లాండు ప్రధానమంత్రి డేవిడ్ కెమెరాన్ కూడా కైరో వెళ్ళి అక్కడి మిలటరి, సివిలియన్ అధికారులతో సంప్రదింపులు జరిపినాడు. వీటన్నింటి నేపథ్యంలో ముందు ముందు ఈజిప్టులో ఎట్లాంటి రాజకీయ పరిణామాలు చోటుచేసుకోబోతున్నాయో వేచిచూడాలి.

***సంప్రదించిన రచనలు :***


1. Armed shoker, "The Price of stability : Egypts Democratic Uprising" Economic and Political Weekly, February 12,2011, VoL.XLVI, No.7
2. Charles Hirschkind, "The Road to Tahrie" Economic and Political Weekly, February, 12,2011, VoL.XLVI, No.7, pp.13-15.
3. Eberhard Kienle, "Tunis, Cairo and Beyond: Susceptible Authoritarians may yet topple, but questions abound", OPEN DEMOCRACY, 29th January 2011, www.opendemocracy.net.
4. Foulath Hadid, "The middle-East Path : Towards Awekening" OPEN DEMOCRACY, 28th January 2011, www.opendemocracy.net.
5. George Fejic, "Egypt and the Thierty years of solitude", OPEN DEMOCRACY,31st, January 2011, www.opendemocracy.net.
6. Meol Michel, "Egypt after Mubarak : Finding Truth in transition",OPEN DEMOCRACY, www.opendemocracy.net.


*(వ్యాసకర్త ఉస్మానియా యూనివర్సిటీలో రాజనీతిశాస్త్ర విభాగం అధ్యాపకులు)*

# రాజకీయ మార్పును కోరుతూ ట్యునీషియాలో ప్రజావెల్లువ

-డేవిడ్

ఉత్తర ఆఫ్రికాలో మధ్యధరా సముద్రం పశ్చిమ తీరానవున్న చిన్న దేశం ట్యునీషియాలో ప్రజా వెల్లువ పెల్లుబికింది. ఈ వెల్లువ ధాటికి నిరంకుశ పాలకుడు జిన్ఎల్అబిద్నిబెన్అలీ 2011 జనవరి 14 అర్థరాత్రి విమానంలో దేశం వదిలి పారిపోయాడు. తలదాచుకునే చోటుకోసం వెదకుతూ ఆ విమానంలో గంటలకొలదీ మధ్యధరా సముద్రంపై ఎగురుతూ గడిపాడు. అతనికి ఆశ్రయమిచ్చేందుకు ఫ్రాన్సు నిరాకరించింది. చివరికి సౌదీ అరేబియా ఆశ్రయమిచ్చింది. ఇలాంటి నిరంకుశ పాలకులు సాధారణంగా మొదట చేరేదక్కడికే. బెన్అలీ ప్రభుత్వాన్ని కూలద్రోసిన ఘటనల క్రమం ఇలాసాగింది.

1. 2010 డిసెంబరు 17న 26 ఏళ్ళ పిజి డిగ్రీగల నిరుద్యోగి మహమ్మద్ బౌబౌజ్‌ను అనుమతి లేకుండా రోడ్డుప్రక్కన పండ్లు కూరగాయలు అమ్ముతున్న "నేరాని"కి పోలీసులు అవమానించి కొట్టారు. దీనికి నిరసనగా తన స్వస్థలమైన సిది బౌజిద్‌లోని పోలీస్‌స్టేషన్ ముందు ఆత్మాహుతి చేసుకున్నాడు. ఆదేరోజు ఆస్పత్రిలో మృతిచెందాడు. ఆ మరుసటిరోజు మరో యువకుడు "నిరుద్యోగం పోవాలి", "దారిద్ర్యం పోవాలి" అని నినాదాలిస్తూ విద్యుత్తు తీగలు పట్టుకొని ఆత్మహత్య చేసుకున్నాడు. దీనితో వరుస ఆత్మహత్యలు సాగాయి. దీనితో ప్రజాగ్రహం కట్టలు తెగి వెల్లువలా పైకెగిసింది.

2. ప్రభుత్వం అత్యవసర పరిస్థితినీ, కర్ఫ్యూనూ విధించింది. 23 ఏళ్ల నిరంకుశ పాలనతో విసిగిపోయిన జనం వెనక్కి తగ్గలేదు. బెన్అలీ ప్రభుత్వంపై వారి ఆగ్రహం పూర్తిస్థాయిలో ప్రజావెల్లువ రూపం తీసుకుంది. కార్మికులు, విద్యార్థులు, యువకులు, మహిళలు, ఉపాధ్యాయులు, లాయర్లు, పత్రికా రచయితలూ ప్రజా ప్రతిఘటనలలో పాల్గొన్నారు. ప్రజావెల్లువ సాయుధ బలగాల్లో సంక్షోభం తెచ్చింది. ప్రజలపై కాల్పులు జరిపేందుకు సైన్యం నిరాకరించటంతో సంయుక్త దళాధిపతి జనరల్ రషీద్ అమర్‌ను బెన్అలీ పదవి నుండి తొలగించాడు.

3. నిరసనకారులను "ముసుగులు ధరించిన గుండాలు", "అతివాదానికీ, టెర్రరిజానికీ ఆత్మలు తాకట్టు పెట్టిన, విదేశాలకు అమ్ముడుపోయిన అసాంఘిక శక్తుల"ని బెన్అలీ మొదట నిందించాడు. అయితే తన పాలన మూలస్థంబాలు కదిలిపోతున్నాయని గుర్తించగానే అంతరంగిక వ్యవహారాల శాఖా మంత్రిని తొలగించం, అవినీతిపై విచారణకు కమిటీ నియామకం వంటి చర్యలు తీసుకున్నాడు. 2011 జనవరి 13న ప్రజలకు ఎక్కువ స్వేచ్ఛలూ ఇస్తాననీ, సంస్కరణలు తెస్తాననీ, 2014లో మళ్లీ పదవికి పోటి చేయకుండా దిగిపోతాననీ వాగ్దానాలు చేశాడు. అయితే ప్రజానీకం వీటిని పట్టించుకోలేదు. "బెన్అలీ దిగిపో" అని ముక్తకంఠంతో నినదించారు.

5. ప్రజల ఆగ్రహమూ. నిరసన అనేక రూపాలలో సాగింది. వారు ప్రభుత్వ భవనాల మీదా, బెన్అలీ పార్టీ ఆర్‌సిడి కార్యాలయాల మీద దాడులు చేశారు. బెన్అలీకీ, అతని భార్యకు చెందిన వ్యాపారాలూ, ఆస్థులను లక్ష్యంగా పెట్టుకుని దాడులు చేశారు. బెన్అలీ అల్లుడి భవనాలనూ, వాణిజ్య సముదాయాలనూ, అతని కుటుంబీకుల కార్లను తగులబెట్టారు. బెన్అలీ మేనల్లుడిని




| | | |
|---|---|---|
| వైశాల్యం | : | 1,63,630 చ.కి.మీ |
| జనాభా | : | 1,04,32,500 |
| రాజధాని | : | ట్యునిస్ |
| అధికార భాష | : | అరబిక్ |
| రెండవ భాష | : | ఫ్రెంచి |
| మతం | : | ఇస్లాం |
| స్థూలజాతీయాదాయం | : | 86,08,6[illegible]0కోట్ల డాలర్లు |
| తలసరి ఆదాయం | : | 3851 [illegible]లర్లు |
| ద్రవ్యం | : | దీనార్ |
| ఎగుమతులు | : | చమురు, ఆహారధాన్యాలు |
| జీవన ప్రమాణం | : | పు. 73 సం॥, స్త్రీ 77 |




చావగొట్టారు. అనేకచోట్ల పోలీసులతో ఘర్షణపడ్డారు. ఈ క్రమంలో వందమంది వరకూ ప్రజలు ప్రాణాలు కోల్పోయారు.

**స్థూల చరిత్ర:**

క్రీస్తు పూర్వం నుండి నాగరికత వెలసిన దేశమిది. రోమన్ సామ్రాజ్యంలోనూ, అట్టోమాన్ సామ్రాజ్యంలోనూ భాగంగా వుండేది. 1850 నుండి ఫ్రెంచి వలస పాలనలలో నలిగిపోయింది. రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మన్ దురాక్రమణకు గురైంది. ఎడారి ఇసుక రేణువుల ప్రతిఘటనా తుఫానులో చిక్కుకుని ఆధునిక సైనిక తంత్ర నిపుణుడిగా పేరుగాంచిన జర్మనీ జనరల్ రోమలస్ ఓటమి పాలైనాడు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం జాతీయ విమోచనోద్యమాల వెల్లువలో భాగంగా ట్యునీషియాలో వలస పాలనకు వ్యతిరేకంగా స్వాతంత్రోద్యమం సాగింది. ఫలితంగా 1956లో స్వాతంత్ర్యాన్ని పొందింది. జాతీయోద్యమ నాయకుడు బౌర్‌జీబా అధ్యక్షుడిగా ప్రభుత్వమేర్పడింది. జాతీయోద్యమ స్ఫూర్తితో దేశాన్ని నడిపేందుకు పూనుకున్నాడు. పాత వలస రాజ్యాలు వదిలిన చెప్పుల్లో కాళ్లుదూర్చి ఆధిపత్య స్థాపనకు పూనుకున్న అమెరికా సామ్రాజ్య వాదం వలస పాలన నుండి బయటపడిన దేశాలన్నింటిలోలాగే ట్యునీషియాలోకీ ప్రవేశించింది. సహాయం పేరిట ప్రపంచబ్యాంకు, ఐయంఎఫ్‌లు కోరలు సాచాయి. 1980 దశకం వచ్చేసరికి అవి దేశ ఆర్థిక విధానాలను నిర్దేశించే పట్టును సాధించాయి.

1980లో అంతర్జాతీయ ద్రవ్యనిధి ట్యునీషియాపై సంస్థాగత సర్దుబాట్ల కార్యక్రమాన్ని రుద్దింది. ప్రజలకిస్తున్న అన్ని రకాల సబ్సిడిలనూ దిగకోయమని ఆదేశించింది. 1984 జనవరిలో ప్రభుత్వం ఆహారసబ్సిడీ తగ్గింపులో భాగంగా రొట్టెధరను రెట్టింపు చేసింది. దీనితో ఆగ్రహించిన ప్రజలు నిరసన ప్రదర్శనలు చేశారు. రాజధాని ట్యునిస్‌లో సాగిన ప్రజాందోళనపై పోలీసు కాల్పులు సాగి 50 మంది మరణించారు. ఈ ఘటన జరిగిన పదినిమిషాల్లోనే అధ్యక్షుడు బౌర్‌బిబా రేడియోలో దేశ ప్రజలనుద్దేశించి ప్రసంగించాడు. అంతరంగిక శాఖామంత్రిని తొలగించినట్లు, రొట్టె ధరను పాతస్థాయికి తగ్గించినట్లు ప్రకటించాడు. అమెరికా రుద్దుతున్న ఆర్థిక కార్యక్రమాన్ని అమలు జరిపేదిలేదని స్పష్టం చేసాడు. దీనితో ప్రజాందోళన ఆగింది.

కానీ ట్యునీషియా రాజకీయ రంగంలో వ్యక్తమైన జాతీయవాద ధోరణులను అమెరికా సహించలేక పోయింది. ఫ్రాన్సు ప్రభావాన్ని తగ్గించి తన ఆధీనంలోకి తెచ్చుకునేందుకు పూనుకుంది. ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొన్న సంక్షోభంతో పెరిగిన నిరుద్యోగం, ద్రవ్యోల్బణాలను చూపి, బౌర్‌జీబాను "అసమర్థపాలకుడి"గా ముద్రవేసి 1987లో సైనిక తిరుగుబాటు చేయించింది. సైన్యాధిపతి బెన్ ఆలీని అధ్యక్షుడిని చేసింది. ఫ్రాన్సును ప్రక్కన బెట్టి బెన్ ఆలీ అమెరికా సామ్రాజ్యవాదుల బంటుగా మారాడు. నవంబరులో సైనిక తిరుగుబాటు జరగ్గా డిసెంబరులో ఐ.ఎం.ఎఫ్‌తో ఒప్పందం చేసుకున్నాడు. జనవరిలో యూరోపియన్ యూనియన్‌తో ఒప్పందం చేసుకున్నాడు. వీటి ప్రకారం ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటీకరణ పేరిట విదేశీ కంపెనీల పరం చేశాడు. స్వేచ్ఛావాణిజ్య కేంద్రాలను తెరచి అక్కడి కార్మికుల వేతనాలను 75 సెంట్లుగా నిర్ణయించాడు. పశ్చిమ యూరపు దేశాలకు కారుచౌక శ్రమశక్తిని సమకూర్చాడు. 23 ఏళ్ల పాలనలో బెన్ఆలీ ప్రపంచ బ్యాంకు నిర్దేశాలను తుచాతప్పక పాటించాడు. ప్రజలకిస్తున్న సబ్సిడీలన్నీ తగ్గించి, ఆహార సరకుల ధరల నియంత్రణ మానివేశాడు. ప్రభుత్వరంగ కార్మికులను పనినుండి తొలగించాడు. ట్యునీషియన్లు పొట్ట చేత పట్టుకుని మృత్యునావల్లో విదేశాలకు వెళ్లారు. 6,50,000 మంది విదేశాల్లో శ్రమిస్తూ 2010 లో వారు వెనక్కు పంపిన ధనం 196 కోట్ల డాలర్లు దీనితో విదేశీ అప్పులు, వాటి వడ్డీలు కట్టుకున్నాడు తప్ప ఈ విదేశీ మారకు ద్రవ్యాన్ని దేశాభివృద్ధికి వినియోగించలేదు.

**ప్రజా వెల్లువకు దారితీసిన పరిస్థితులు:**

ఈ విధానాల ఫలితంగా ట్యునీషియా, ఆర్థిక, రాజకీయ సంక్షోభంలో చిక్కుకుంది. 15-24 ఏళ్ల వయస్సులోని యువతలో సగం నిరుద్యోగులు, నిత్యావసరాల ధరలు ఆకాశాన్నంటాయి. ప్రైవేటీకరణతో ఉద్యోగ అవకాశాలు సన్నగిల్లాయి. ప్రజల జీవితాలు దుర్భరమయ్యాయి. అవినీతితోనూ, ప్రభుత్వ ఆస్తులను కొల్లగొడుతూనూ కొద్దిమంది సంపదలు పోగేసుకుంటుండగా శ్రామిక వర్గాలూ, మధ్య తరగతి జనులూ ఆకలి, దారిద్ర్యంలో

కూరుకుపోయారు. మధ్యధరా సముద్రపు ఆవలి తీరాన ఉపాధి కొరకు పడవలలో ప్రయాణించి మృత్యువాతపడుతున్న యువకుల జీవితాలు రోజువారీ వార్తలై 'మృత్యునావ'లన్న పేరు స్థిరపడి పోయింది. స్వేచ్ఛా వాణిజ్య కేంద్రాల్లోని వస్త్ర పరిశ్రమలో వేతనాలు హీనస్థాయిలో వున్నాయి. అయినా ఐ.ఎం.ఎఫ్ ఆదేశాల ప్రకారం బెన్ ఆలీ ఆహారం, పెట్రోలు ధరలు పెంచివేశాడు. అవినీతి, అక్రమార్జనలకు అడ్డూ అదుపులేకుండా పోయింది. బెన్‌ఆలీ, అతని భార్య వారి బంధుగణం దేశసంపదలో 50 శాతాన్ని కైవశం చేసుకున్నారు.

అయినా ప్రపంచ బ్యాంకు 7 శాతం మాత్రమే దారిద్ర్యంలో వున్నారనీ, దేశం గణనీయంగా అభివృద్ధి చెందిందనే కితాబులిచ్చింది. 93 శాతం మించి ప్రజలకు కనీస అవసరాలన్నీ తీర్చుకోగల ఆదాయం వస్తుంటే ఇంత అశాంతి, తిరుగుబాటు వచ్చివుండేవికావు. సామ్రాజ్యవాదుల పనుపున బెన్‌ఆలీ నిరంకుశ పాలన సాగించాడు. ప్రతిపక్షాలను నిర్దాక్షిణ్యంగా అణచివేశాడు. ఛాందసవాద ప్రమాదాన్ని తప్పించటమన్న సాకుతో బూర్జువా మత ధోరణులున్న ప్రధాన ప్రతిపక్షపార్టీపే 1990లో దాడి సాగించాడు. ఆ తర్వాత జాతీయవాదులు, వామపక్ష శక్తులు, ఉదారవాదులు, విద్యార్థి నాయకులపై విరుచుకుపడ్డాడు. ఎన్నికల్లో తనకు 97 నుండి 99 శాతం ఓట్లు పడ్డాయన్న అతని మాటలే ఎన్నికలెంత తంతుగా నడిచాయో తెలువుతుంది. ట్రేడ్‌యూనియన్లనూ, మానవ హక్కులనూ, సాంస్కృతిక, సామాజిక సంస్థలనూ, చివరకూ క్రీడా సంస్థలనూ కూడా బెన్ ఆలీ ప్రభుత్వం అనుమతించలేదు. ఒక పత్రిక రచయిత వాఖ్యానించినట్లు "ప్రజలు కలుసుకునేందుకు మిగిలిన ఏకైక స్థలం జైలు". పత్రికా విలేఖరులను జైళ్లలో కుక్కాడు. విదేశీ పత్రికా విలేఖరులను దేశంలోకి అనుమతించలేదు. ప్రజావెల్లువ వార్తలు తెలుసుకునేందుకు సెల్‌ఫోనులతో తీసి పంపిన చిత్రాలే ఆధారమయ్యాయి.



ఆ నిరంకుశపాలనలో ప్రజలకు ఊపిరాడని స్థితి ఏర్పడింది. ఎప్పుడైనా అంటుకుని దావానంలా వ్యాపించే ఆగ్రహం వారిలో పేరుకుపోయివుంది. పండ్లు, కూరగాయాలు అమ్ముకుంటున్న నిరుద్యోగిపై సాగిన దురంతం దీనికి అజ్యం పోసింది. ప్రజాగ్రహం పెను వుప్పెనగా జ్వలించింది.

**నూతన అధికారం కోసం పోరాటం:**

బెన్‌ఆలీ ప్రభుత్వం కూలిపోయేముందు ట్యునీషియాలోని దోపిడీ పాలక వర్గాలూ, వారి సామ్రాజ్యవాద యజమానులూ ప్రజావెల్లువపై బురద జల్లేందుకూ, అణచివేసేందుకూ అన్నిరకాల పద్ధతులనూ ప్రయోగించారు. అయినా ప్రజావెల్లువ ఆగకపోవటంతో ఆరోజే కనుగొన్నట్లు బెన్‌ఆలీ అత్యంత నిరంకుశ పాలకుడనీ, అతనే ఈ సంక్షోభానికి కరకుడనీ, అతన్ని పదవీచ్యుతుడ్ని చేస్తే సమస్య తీరిపోయినట్లు మాట్లాడటం మొదలు పెట్టారు. సామ్రాజ్యవాద పత్రికలన్నీ ఈ పాటే పాడాయి. తమకు సేవ చేసిన నమ్మినబంటును దేశం దాటించి చెత్తబుట్టలో పడేశాయి. జాతీయ ఐక్యతా మధ్యంతర ప్రభుత్వమన్నది ఈ ప్రయత్నాలలో భాగంగా ఏర్పడిందే. ప్రజా వెల్లువకు నాయకత్వం వహించిన జనరల్ యూనియన్ ఆఫ్ ట్యునీషియన్ వర్కర్స్ (యుజిటిటి) ప్రతినిధులు ముగ్గురిని ఈ ప్రభుత్వంలో మంత్రులుగా చేర్చుకున్నారు. బెన్‌ఆలీ పార్టీ ఆర్‌సిడి నాయకులతో మంత్రి వర్గాన్ని నింపారు. రక్షణ-విదేశీ వ్యవహారాలు ఆర్థికం అంతరంగిక వ్యవహారాలు వంటి కీలక మంత్రిత్వశాఖలని బెన్ ఆలీ అనుయాయులతో నింపారు. ఈ మధ్యంతర ప్రభుత్వం కొత్త సీసాలో పాత సారాయి అయింది. కొన్ని ప్రతిపక్ష శక్తులకు కొన్ని శాఖలిచ్చి వారినోళ్ళు కట్టివేశారు. ఇది ప్రజా వెల్లువను వమ్ము చేసే ప్రయత్నం.

కొత్త ప్రభుత్వంలో ఆర్‌సిడి నాయకులను మంత్రులుగా చేయటాన్ని నిరసిస్తూ 24 గంటల్లో యుజిటిటి ప్రతినిధులు మంత్రిపదవులకు రాజీనామా చేశారు. దీనితో మంత్రివర్గం నుండి ఆర్‌సిడి నాయకులను తొలగించాలన్నది నిరసనకారుల నినాదమైంది. వీరిని తొలగించి జాతీయ పరిష్కార ప్రభుత్వాన్ని ఏర్పరచాలంటూ యుజిటిటి నాయకత్వాన ప్రజా ప్రదర్శనలు సాగుతున్నాయి. పోలీసులు కూడా ఆందోళనలో చేరుతున్నారు. జాతీయ ఐక్యత అన్న ప్రభుత్వం అణచివేత చర్యలు తీసుకుంటూనే, పాత ప్రభుత్వం నుండి "పూర్తి తెగతెంపులు" చేసుకుంటానని వాగ్దానం చేస్తున్నది. అయితే "పూర్తి తెగతెంపులు" సామ్రాజ్యవాద ద్రవ్యసంస్థలు రుద్దిన నయాఉదారవాద సంస్కరణలనుండి తెగ తెంపులుగా వుంటాయని చెప్పటం లేదు. రాజకీయ ఖైదీల విడుదల,



రాజకీయ పార్టీల ఏర్పాటుకు చట్టం వంటి సంస్కరణలు చేస్తానని వాగ్దానం చేస్తున్నది. ప్రజల కోపాన్ని తగ్గించేందుకు బెన్ ఆలీతో సంబంధంవున్న కొందరిని ఆరెస్టు చేయటం వంటి చర్యలను ప్రధానమంత్రి ఘన్నౌఛీ తీసుకున్నాడు. అయితే ప్రజలీ ప్రభుత్వాన్ని గుర్తించేందుకు నిరాకరిస్తున్నారు. ఎటూ తేలని స్థితిలో ఇప్పటి పరిస్థితి వుంది. అది ఏ వైపుకు దారితీస్తుందన్నది వేచిచూడాల్సి వుంటుంది.

### ప్రజా వెల్లువ భవితవ్యం:

అధికార బలంతోనూ, ఆయుధ సంపత్తితోనూ పాలన సాగించగలమని విర్రవీగిన నిరంకుశపాలకులందరూ పీడిత ప్రజా తిరుగుబాటు ముందు వీగిపోయారు. చరిత్ర చెత్తబుట్టలో చేరారు. బెన్ఆలీ కూడా ప్రజా వెల్లువ ముందు కూలిపోయాడు. ప్రజా వెల్లువకు అవసరమైన భౌతిక పరిస్థితివుంది. అవి ప్రజావెల్లువను-అప్రయత్న పూర్వక వెల్లువనూ, ట్యునీసియాలో జరిగినట్లు కొంత మేరకు నిర్మాణయుతంగానూ తెచ్చాయి. అయితే ఈ వెల్లువ తనంత తాను ఈ సామాజిక వ్యవస్థను మార్పు చేసే విప్లవంగా పరివర్తన చెందజాలదు. కొన్ని సందర్భాల్లో ఓటమికి గురికావచ్చు. లేదా ప్రభుత్వాధినేతల మార్పును తేవచ్చు, కొన్ని సంస్కరణలను తేవచ్చు. ట్యునీషియా పరిణామాలు రాజకీయ పరిస్థితితో మార్పును తెస్తాయన్నది నిస్సందేహం. ఆ మార్పు ప్రజానుకూలంగా ఏ మేరకు ఉంటున్నది ప్రజా వెల్లువను నడుపుతున్న వారిపై ఆధారపడి వుంటుంది.

ప్రజా వెల్లువను తమకనుకూలంగా మలుచుకుని తమ దోపిడీపాలనను కొనసాగించేందుకు దోపిడీ వర్గాలు సకల ప్రయత్నాలూ చేస్తాయి. తమకు సేవలందించి అప్రదిష్టపాలైన పాలకుడిని వదిలి. మరో సేవక పాలకుడిని ప్రజావెల్లువ మొగదల నిలిపేందుకు పూనుకుంటాయి. ట్యునీసియాలో నేడు జరుగుతున్నది ఇదే. ఒక వేళ ప్రజాశక్తులు పైచేయి కలిగిన ప్రభుత్వ మేర్పరచగలిగినా, అనేక బూటకపు నినాదాలతో దానిని తన కనువుగా మలుచుకునేందుకూ ప్రయత్నాలు చేస్తాయి. ఫిలిప్పైన్సులో ప్రజా వెల్లువ అగ్రభాగాన నిలిచిన ఆక్వినో సారధ్యంలోని ప్రభుత్వాన్ని ఆర్థిక మీటలతో తమకనువుగా మలుచుకున్న అనుభవం మన ముందువుంది. అలా ట్యునీషియా జాతీయోద్యమ నాయకుడు బౌర్‌జీబా ప్రభుత్వాన్ని ఆర్థిక మీటలతో బిగించి అసమర్థుడని తొలగించిన అనుభవం కూడా ట్యునీషియా ప్రజల ముందుంది. ప్రజావెల్లువ విజయవంతమై ప్రజానుకూల ప్రభుత్వం ఏర్పడి కొనసాగాలన్నా, సామాజిక వ్యవస్థ మార్పుకు అది దారితీయాలన్నా పీడిత వర్గ ప్రయోజనాలే పరమావధిగాగల రాజకీయ శక్తులూ, నిర్మాణమూ వెల్లువకు నాయకత్వం వహించి నడిపించాల్సి [illegible]. అదిమాత్రమే ప్రజల ఆకాంక్షలను నెరవేర్చగలదు.

నేడు ట్యునీషియాలో పాత ప్రభుత్వంలో ఆధిపత్యం వహించి శక్తులను తొలగించాలని కోరుకుంటున్న వర్గాలకూ, శక్తులకు మారిన రూపంతో పాత శక్తుల ఆధిపత్యాన్నే కొనసాగించాలన వర్గాలకూ, శక్తులకూ మధ్య తీవ్రపోరాటం సాగుతున్నది ప్రతీపశక్తులకు సహకారమిచ్చి పాత అధికార శక్తుల పాలనన తిరిగి నెలకొల్పి కోల్పోయిన తన ప్రాభవాన్ని తిరిగి పొందాల ఫ్రాన్సు సామ్రాజ్య వాదం ప్రయత్నిస్తుండగా, ఈ ఘర్షణల తనకనుకూల శక్తులే అధికారంలోకి వచ్చే ప్రయత్నాలను అమెరిక సామ్రాజ్యవాదులు ముమ్మరంగా చేస్తున్నారు. ప్రత్యేకించి గత రెం దశాబ్దాలుగా ఆరబ్, ముస్లిం ప్రజలపై తాము సాగించిన యుద్ధాల వారిలో పేరుకుపోతున్న ఆగ్రహం కట్టలు తెంచుకు పెల్లుబికుతుందన్న భయం సామ్రాజ్యవాదులందరికీ ఉంది. ఈజి లెబనాన్ తదితర ఆరబ్ దేశాలలో ప్రజానిరసన ఊపందుకుంటున్నాయి. దీనితో ట్యునీషియా ప్రజా వెల్లువను అణ వివిధ పద్ధతులను, మార్గాలను వినియోగించే పని సామ్రాజ్యవాదులు ముమ్మరం చేస్తారు.

ప్రజా వెల్లువను వమ్ముచేసే దోపిడీ వర్గాల, సామ్రాజ్యవాదు ప్రయత్నాలను ట్యునీసియాలోని ప్రజాశక్తులు ఇంతవరకూ ఎదురొ నిలవటం ఆహ్వానించదగ్గ పరిణామం. ఈ ఘర్షణలో అంతి విజయం ఎవరిదన్నది సాగుతున్న పోరాట క్రమం నిర్ణయిస్తుం రాజకీయ మార్పు కొరకు పోరాడుతున్న శక్తులు పైచేయి పొంది ప్రజలకు కొన్ని హక్కులు రావటానికీ.జీవన పరిస్థితుల్లో కొం మెరుగుదలకూ అవకాశాలు ఏర్పడుతాయి. పోరాట అనుభవా ప్రజల చైతన్యాన్ని మరో మెట్టు ఎక్కిస్తాయి. ఇది భపరిణామం.నిరంకుశ పాలనకు వ్యతిరేక పోరాట కొలమి కాలుతూ, కాకలు తీరుతున్న ట్యునీషియా ప్రజలు ఆ దిశ పయనిస్తారని ఆశిద్దాం.

*వ్యాసకర్త : చరిత్ర పరిశోధకు*

# మతకలహాలు - 2010

-డా॥ అస్గర్ అలీ ఇంజనీర్

భారతదేశం ఏ సంవత్సరమూ కూడా కల్లోల రహితంగా లేదు. బాబ్రీమసీదు కూల్చివేత తర్వాతి 1992-93 సం॥లు; 2002లో గుజరాత్‌లో సంభవించిన అతిపెద్ద మత మారణకాండ, 2008లో కంధమాల్ కలహాలు కాగా జాతీయ స్థాయిలో కెక్కని కలహాలు మిగతా సంవత్సరాలలో జరిగాయి. 1992లో ముంబాయిలో జరిగిన మతకలహాల వంటివో, 2002లో గుజరాత్‌లో జరిగిన వంటివో కాకున్నా 2010 సం॥లో మధ్యస్థాయి పట్టణాలు, చిన్న పట్టణాలు, గ్రామాలస్థాయిలో ఈ కలహాలు చోటు చేసుకున్నాయి.

ఏమైనా,కొన్ని కలహాలు కలవరం కలిగించేవిగా వున్నాయి. అలాగే ఆర్.ఎస్.ఎస్ మరియు దాని అనుబంధ సంస్థల నిరంతరాయ ప్రయత్నాల కారణంగా పెరుగుతున్న మతతత్వీకరణనూ విస్మరింపజాలం, తమ స్వీయ ప్రయోజనాలకనుగుణంగా కాంగ్రెస్ వంటి మితవాద పార్టీకూడా మతతత్వ ప్రమాదంపై, మతతత్వ బిజెపిపై తన దాడిని ఎక్కుపెట్టింది. మతతత్వ రాజకీయాలను బిజెపి అనేక కారణాల వలన తానుగా తీవ్రంగా ముందుకు సాగించలేక పోతున్నది. కానీ తన సంఘపరివారంలోని ఇతర సంస్థలను ఆ పనికి నియోగిస్తున్నది. బిజెపి కొన్ని రాష్ట్రాలలో అధికారంలో వుండి, ఈ రాష్ట్రాలలో ఆర్.ఎస్.ఎస్. ను ముందుంచడంతోపాటు ఆర్.ఎస్.ఎస్. నేపథ్యం కలవారిని వివిధ ప్రభుత్వ విభాగాలలోకి చేర్చుకోవటమనేది లౌకిక వాదానికి పెను ప్రమాదంగా వుంది.




కేంద్ర హోంమంత్రిత్వశాఖ సమాచారం ప్రకారం 2001-2009 మధ్యకాలంలో 6,541 మత ఘర్షణలు జరుగగా వీటిలో 2,234 మంది చనిపోయారు. అధికారికంగా చెప్పిన మతఘర్షణల సంఖ్య వాస్తవ మేననుకున్నా, అనేక కారణాలతో మృత్యు సంఖ్యను సరిగ్గా పేర్కొనటం అనేదేది జరగదు. 2002లో ఒక్క గుజరాత్ రాష్ట్రంలోనే 2000 మందికి పైగా చనిపోయారని అధికార వర్గాలన్నీ చెపుతుండగా, అధికార సమాచారం ప్రకారం 2001-2009 మధ్య 8 సంవత్సరాల కాలంలో 2,234 మంది మరణించారు. అంటే గుజరాత్ మృతులను మినహాయిస్తే 8 సంవత్సరాల కాలంలో మత ఘర్షణలలో 234 మందే మరణించారనటం వాస్తవం కాదు.

గుజరాత్ మత కలహాలలో 1000 మంది చనిపోయారనే కేంద్ర ప్రభుత్వ అధికారిక గణాంకాలను పరిగణలోకి తీసుకున్నప్పటికీ కూడా 8 సంవత్సరాల కాలంలో 1234 మంది అంటే సంవత్సరానికి 150 మందికి పైగా మత ఘర్షణల్లో చనిపోయారని అర్థమౌతుంది. ఇది కూడా చిన్న సంఖ్యేమీకాదు.

2009 చివరలో- డిసెంబరు 30వ తేదిన రాజస్థాన్‌లోని భిలెవాడలో చివరిగా మతకలహం జరిగింది. 2010 సంవత్సరం కూడా 2 భయంకరమైన కలహాలను చూసింది. సంఘపరివారం రాజస్థాన్‌ను గుజరాత్‌గా మార్చేందుకు వీలైన అన్ని ప్రయత్నాలనూ చేస్తున్నది. రాజస్థాన్ కూడా ఇప్పటికే ఆ విధంగా మలచబడింది.

మహారాష్ట్రలో 1995-2000 మధ్య బిజెపి-శివసేన సంకీర్ణ ప్రభుత్వం అధికారంలోనున్న కాలం మినహా కాంగ్రెస్ పార్టీనే మిగతా కాలమంతా అధికారంలో కొనసాగినప్పటికీ మహారాష్ట్ర మత పరంగా సున్నితమైన రాష్ట్రంగానే వుంది. ప్రభుత్వ రికార్డుల పరంగా 2009 జనవరి 16న మహారాష్ట్రలోని ఎవత్‌మహల్‌లో మొదటి కలహం చోటు చేసుకుంది. కాలేజీచౌక్‌లో శివాజి, బాలథాకరేల చిత్రపటాలకు నల్లరంగు పూశారనే పుకార్ల కారణంగా ఈ సంఘటన జరిగింది. శివసైనికులు వీధుల్లోకి వచ్చి బస్సులు, వాహనాలు, షాపులపై రాళ్ళు విసిరారు. ప్రాణనష్టం జరగకముందే పోలీసులు పరిస్థితిని అదుపుచేశారు. 50 మంది శివసైనికులను పోలీసులు అరెస్టు చేశారు.

కర్ణాటక- ముఖ్యంగా దక్షిణ కర్ణాటక మత పరంగా ఉద్రిక్తలకు నిలయమైన మరొక ప్రాంతం. బిజెపి అధికారంలోకి వచ్చినప్పటి నుండీ 'రామసేన' తన చర్యలను తీవ్రం చేసింది. క్రిస్టియన్లు ముస్లిములు కూడా ఈ రాష్ట్రంలో దాడులకు గురౌతున్నారు. చర్చీలపైనా, మసీదులపైనా దాడులు పెరిగాయి. జనవరి 31న భత్కల్, మైసూర్‌లలో చర్చీలపై దాడులు కొనసాగటంతోపాటుగా

మంగుళూరులో మేరీమాత గాజు విగ్రహంపై దాడి జరిగింది. ఇంతేగాక మంగుళూరు లోని రెండు మసీదులు, ఒక అనాధ శరణాలయం, ఒక షాపు, ఒక ఇల్లు దాడికి గురైనవాటిలో వున్నాయి. అనాధ శరణాలయం దాడిలో ఒక విద్యార్థి గాయపడ్డాడు.

కర్ణాటకలోని షిమోగా, ఉత్తరప్రదేశ్‌లోని బరేలీలో మహమద్ ప్రవక్త జన్మదినం సందర్భంగా మతహింస చోటుచేసుకుంది. కన్నడ వార్తాపత్రిక 'కన్నడప్రభ'లో ప్రచురితమైన తస్లీమానస్రీన్ వ్యాసం యొక్క అనువాదంతో రెచ్చగొట్టే ప్రక్రియ ప్రారంభమైంది. తస్లీమానస్రీన్ దానితో తనకేవిధమైన సంబంధం లేదని నిరాకరించింది. వాస్తవానికి 2006లో ఇంగ్లీషులో "బురాఖా"పై తను వ్రాసిన వ్యాసానికి చేసిన అనువాదం వక్రీకరించబడిందని ఆమె పేర్కొన్నారు. షిమోగా, హస్సాన్- రెండు పట్టణాలలో మతహింస చోటుచేసుకోగా, కర్ఫ్యూ విధించబడింది. ప్రాణనష్టం లేకపోయినప్పటికీ వాహనాలు తగులబెట్టబడ్డాయి. పరిస్థితిని అదుపుచేయటంకోసం రెండు రోజులపాటు కర్ఫ్యూ పొడిగింపబడింది.

ఉత్తరప్రదేశ్‌లోని బరాలీలో కూడా మహమ్మద్ ప్రవక్త జన్మదినం సందర్భంగా మతహింస జరిగింది. మార్చి 2వ తేదీన ముస్లింలు మహమ్మద్ జన్మదినం సందర్భంగా ప్రదర్శన నిర్వహించారు. వేలాదిమంది ముస్లింలు పాల్గొన్న ఈ ప్రదర్శన ఒక నిర్దిష్ట మార్గంలో సాగనీయకుండా కొందరు హిందువులు అభ్యంతర పెట్టారు. బరైలీకి మతహింసకు సంబంధించిన చరిత్రలేదు. ఇరువైపులా రాళ్ళు విసురుకోవటం; వాహనాలు, ఇళ్ళు ధ్వంసం చేసుకోవటం జరిగాయి.

300 మంది కానిస్టేబుల్స్‌కు ఇంతపెద్ద గుంపును నియంత్రించటం సాధ్యం కాకపోవటంతో కర్ఫ్యూను విధించి పరిస్థితిని అదుపులోకి తీసుకువచ్చారు. ఏమైనప్పటికీ, మార్చి 8న ఉత్తహింద్-ఎ-మిల్లత్ మండలి అధ్యక్షుడు మౌలానా తైకీర్‌లాజాఖాన్ ఊరేగింపులో రెచ్చగొట్టే ఉపన్యాసాలు చేసినందుకు మార్చి 8న అతనిని పోలీసులు అరెస్టు చేశారు. ముస్లింలు నిరసన తెలియజేయటంతో మార్చి 11న అతనిని విడుదల చేశారు. దీనితో హిందువులు నిరసన తెలియజేశారు. ముస్లింల వత్తిడి ఫలితంగా అతనిని విడుదల చేశారని పేర్కొంటూ మార్చి 12 నుండి కొత్తగా సమస్యను రాజేశారు.

హోలీ మరియు మహమ్మద్ ప్రవక్త జన్మదినం ఒకేరోజు రావటంతో ముస్లింలు రెండురోజుల తర్వాత ఊరేగింపులు జరపాలని నిర్ణయించుకున్నారు. ఆంజుమాన్ - ఎ - ఖౌద్దమ్ - ఎ - రసూల్‌కు చెందిన షబానీ మెయిన్ ఈ విధంగా జరపటానికి అంగీకరించలేదు. దీని కారణంగా గత రెండు సంవత్సరాల నుండి






రెండు ఊరేగింపులూ జరుగుతున్నాయి. ఇది మతఘర్షణల రూప తీసుకొంది. బాబ్రీమసీదు కూల్చివేత అనంతరం కూడా ప్రశాంతం ఉన్న బరైలీ హఠాత్తుగా ఎందుకు ఈ విధంగా బ్రద్దలయింద దానికి భిన్నమైన ఊహాగానాలున్నాయి. కాంగ్రెస్ యొక్క పాత్ర అభద్రతకు గురైన మయావతి బిజెపితో రహస్య అవగాహన హిందూ, ముస్లీం ఓట్లను ఒక దగ్గరకు సమీకరించేందుకు కాంగ్రెస్ బియస్‌పి మత హింసను ప్రేరేపించటంలో ఏమాత్రం వెనుకాడట లేదు. మత హింస అనేది ఒక రాజకీయ విధానంగా మారిపోయిం కానీ మత పరమైందిగా ఎంతమాత్రమూ లేదు.

ఈ విధంగా బరైలీ చాలాకాలంగా కర్ఫ్యూ నీడలో వుం ఇంతకుముందెన్నడూ జరగని విధంగా పెద్దఎత్తున ఆస్తుల విధ్వంస ఈ సందర్భంగా జరిగింది. ఈ కల్లోలం ముఖ్యంగా బి.యస్.పి కాంగ్రెస్‌ల మధ్య శత్రుత్వం కారణంగా సంభవించింది.

జాతీయ ప్రాధాన్యతను సంతరించుకొనడంతో పాటు పార్లమెంట్‌లో కూడా ఈ అంశం లేవనెత్తబడింది.

హైదరాబాదులోని పాతబస్తీ-బిజేపి, ఎం.ఐ.ఎంల మ వైరం కారణంగా మతపరంగా తీవ్ర ఉద్రిక్తతలకు నిలయంగావుం పాతబస్తీలో పేదలు, నిరుపేదలుగా వున్న ముస్లీంలు బిజె సమర్థుకులైన కొందరు వ్యాపారులతో కలిసిమెలసి వారివ పనిచేస్తున్నారు. ఎక్కువ మంది పేద ముస్లీంలు మజ్లిస్ సమర్థకులు వున్నారు. మజ్లిస్ తన రాజకీయ ప్రభావాన్ని పెంచుకునేందుక అందులో భాగంగా మహమ్మద్ ప్రవక్త జన్మదినాన్ని పెద్దస్థాయి జరిపేందుకు, అంతేకాక గతమెన్నడూలేని విధంగా ప్రవ 'మసోలియం' యొక్క ప్రతిరూపాన్ని ప్రతిష్టించేందుక నిర్ణయించింది. అందుకుగానూ పాతబస్తీ ప్రాంతమంతా విద్యు దీపకాంతులతో అలంకరించి, 'బరావఫత్' అంటే ప్రవక్త జన్మదిన తర్వాత కూడా చాలా కలం అలాగే వుంచింది. కాగా, బిజె

కూడా ఏమీ తక్కువ తినకుండా హనుమాన్ జయంతి పెద్దస్థాయిలో జరపటంతో పాటుగా భారీ విగ్రహాలను అసాధారణంగా నిర్మించారు. బిజెపి కార్యకర్తలు మహమ్మద్ ప్రవక్త జన్మదిన అలంకరణలో భాగంగా వుంచిన జెండాలను తొలగించటంతో ఘర్షణలు చోటు చేసుకున్నాయి.

బిజెపి, మజ్లిస్‌ల మధ్య ఈ తక్షణ కారణంతో పాటుగా శత్రుత్వానికి ఇతర కారణాలూ వున్నాయి. హెలీకాప్టర్ ప్రమాదంలో రాజశేఖర్‌రెడ్డి మరణం తర్వాత నూతన ముఖ్యమంత్రిగా రోశయ్య పదవిలోకి వచ్చాడు. కాగా రాజశేఖరరెడ్డి కుమారుడు జగన్మోహన్ రెడ్డి ముఖ్యమంత్రి కావాలని కాంక్షస్తున్నాడు. కానీ కాంగ్రెస్ అధినాయకత్వం రోశయ్యను ముఖ్యమంత్రిగా ఎంపిక చేసింది. రోశయ్య ప్రభుత్వాన్ని అస్థిరపరిచేందుకు ఈ కల్లోలాలలు వెనుక అతను వున్నాడని చాలామంది భావించారు. కానీ, మరోక విషయం కూడా ముందుకొచ్చింది. అదేమంటే కొంతమంది పెద్దపెద్ద బిల్డర్స్ ఈ విధమైన హింసను సృష్టించటం ద్వారా ఈ స్థలాలను ఖాళీ చేయించి ఈ స్థలాలను పెద్ద పెద్ద కట్టడాల నిర్మాణానికి వినియోగించ పూనుకున్నారనేది మరొక వాదన కూడా దీని వెనుకవుంది. బిజెపి ఈ ఈ ప్రాంతంలో తన స్థానాన్ని పెంచుకోదలుచుకున్నది. పొరుగునే వున్న కర్నాటకలో అధికారంలో ఉన్నప్పటికీ బిజెపి ఆంధ్రప్రదేశ్‌లో అధికార పీఠం కోసం ఇంతవరకు పరీక్షింపబడలేదు. ఆ కారణంగా హిందువుల ఓట్లను సంఘటితం చేసేందుకు వి.హెచ్.పి, కార్యకర్తల ద్వారా మతహింసను రెచ్చగొట్టిందనేది మరొకటి. మోటారు వాహనాలపై వచ్చినవారు ఈ విధమైన దాడులకు పాల్పడ్డారని చెప్తున్నారు.

ఈ మత కలహం కూడా పెద్ద స్థాయిలోదే. ఒక నెల కాలం పాటు కొనసాగింది. ఈ కాలమంతా పాతబస్తీ కర్ఫ్యూ కొనసాగింది. పనికి కూడా బయటకు వెళ్ళలేక పేదలు ఎన్నో అవస్థలు పడ్డారు. అనేక ప్రభుత్వేతర సంస్థలు సహాయం అందించేదుకు ముందుకు వచ్చాయి. రాజకీయ నాయకులు ఆడే రాజకీయ క్రీడలలో బాధితులంతా పేదలే! పెద్ద ఎత్తున ఆస్తుల విధ్వంసంతోపాటుగా ఇద్దరు వ్యక్తులు కత్తిపోట్లకు గురయ్యారు.

పాతబస్తీలోకి బయటనుండి ప్రవేశించి హింసను ప్రేరేపించే వారి నుండి, తమనుతాము రక్షించుకునేందుకు 9-14 సంవత్సరాల వయసున్న యువ ముస్లీంలు బృందాలుగా ఏర్పడ్డారు. ఇంగ్లాండ్‌కు చెందిన ఒక విద్యార్థి ఈ రక్షణ బృందాలపై ఒక అధ్యయన పత్రాన్ని రూపొందించి, ఈ వ్యాసకర్త హాజరైన, ఆస్ట్రేలియాలో జరిగిన ఒక మహాసభలో సమర్పించారు. ఈ యువకులు అప్పటికప్పుడు స్పందించి బృందాలుగా ఏర్పడ్డారు మినహా, వీరివెనుక ఏ రాజకీయ పార్టీ లేదా శక్తీ వుండి దీనిని ఆర్గనైజ్ చేయలేదు. మతహింస ఏప్రిల్ ప్రారంభం వరకు దాదాపు నెలరోజులు కొనసాగింది.

ఏప్రిల్ 25న ఉత్తరప్రదేశ్‌లోని ఆగ్రాలో కొంతమంది ఆడపిల్లల్ని కొందరు వేధింపులకు గురిచేశారనే పుకార్లు వ్యాపించడంతో మతపరమైన హింస చోటుచేసుకుంది. 25 షాపులు తగలపెట్టబడ్డాయి. ఫోర్టు ప్రాంతంలోని శివాజి మార్కెట్‌లో ఈ షాపులను తగలబెట్టటం ద్వారా ఇది మత రూపం తీసుకుంది. అధికారులు మాత్రం ఇది మతపరమైన స్వభావం కలిగినది కాదని నిరాకరించారు. రెండు సమూహాలకు చెందినవారు రెండు భిన్న మతాలకు చెందినవారు కావటం వలన ఇది మత స్వభావం సంతరించుకున్నదని అనిపిస్తుంది.

మహారాష్ట్రలోని ధూలే ప్రాంతం కూడా సున్నితమైన ప్రాంతంగా వుంది. గతంలో కూడా ఘోరమైన కలహాలు ఇక్కడ చోటుచేసుకున్నాయి. కలెక్టరు ఆఫీసు ఎదురుగా ఇస్లామ్ మత ప్రవక్త కార్టూన్‌లతో కూడిన పోస్టర్లు ప్రదర్శించడమనేది ముస్లీంల నిరసనలకు కారణమైంది. మే నాలుగున ఆందోళనకారుల గుంపులపై పోలీసులు లాఠీఛార్జీ చేయటంతోపాటు, కాల్పులు కూడా సాగించారు. దీనితో నలుగురు గాయపడగా లాఠీఛార్జీలో మరెందరో దెబ్బ తిన్నారు. రాళ్ళు విసురుతున్న సందర్భంలో డి.యస్.పి వాహనం కూడా దెబ్బతిన్నది. ధూలేకు ఇన్‌ఛార్జి మంత్రిగా వున్న అబ్దుల్ సత్తార్ శాంతి కమిటీ సమావేశాలు నిర్వహించి హింసు నిరోధించగలిగారు.

ఆరుదశాబ్దాలపైగా స్వాతంత్ర్యానంతర కాలంలో కూడా, లౌకిక రాజ్యాంగపాలనానంతరం కూడా అప్రధానమైన అతిచిన్న విషయాలకుకూడా మతపరమైన హింస చెలరేగటం ఆశ్చర్యకరం! మహారాష్ట్రలోని అమాల్నెరిలో మే 19వ తేదీన పిండిమరలో మర ఆడించే వద్ద ఈ ఘర్షణలు చోటుచేసుకున్నాయి. ఆ పిండిమర ఒక ముస్లింకు చెందినదికాగా, ఒక హిందూ ఖాతాదారుడు తాను తెచ్చిన పప్పుదినుసులను మొదటి ప్రాధాన్యం ఇచ్చి మరవేయాలని



పట్టుబట్టటం, మాటామాటా పెరగటం, ముస్లింలను లక్ష్యంగా చేసుకొని హింస చెలరేగటం జరిగిపోయాయి. గుంపులను చెదరగొట్టేందుకు పోలీసులు గాలిలోకి కాల్పులు జరిపారు. ఇద్దరు వ్యక్తులు కాల్పులలో గాయపడ్డారు. పోలీసులపై కూడా దాడి జరిగింది. వారు 9 మంది గాయపడ్డారు.

రాజస్థాన్‌లో బలేసార్ గ్రామ సమీపంలో మే 23న మత పరమైన హింస జరిగింది. సైనీలలో అధిపత్య మతానికి చెందిన సభ్యుడొకరు పోలీసు కాల్పులలో చనిపోవటంతో వీరంగా పోలీస్‌స్టేషన్‌పై దాడి చేశారు. దీనికి ముందుగా ఈద్‌గాను ధ్వంసం చేశారు. రహదారులు విశాలం చేయటంలో భాగంగా ఒక షాపును తొలగించటంతో వివాదం తలెత్తి ఈ సంఘటనలు జరిగాయి. ఎన్.ఆర్.ఇ.జి.ఏ పథకం క్రింద పనిచేస్తున్న కూలీలందరూ కలిసి ఈద్‌గాలోని ఒక భాగాన్ని నష్టపరిచారు.

మే 26వ తేదీన అహమ్మదాబాద్‌లో మత హింస బ్రద్దలైంది. షాపూర్‌వూ ప్రాంతంలో యాసిడ్ దాడుల్లో ఒక వ్యక్తిని చంపివేశారు. షాపుల నిర్వాహకులు తమ షాపులను వెనువెంటనే మూసివేశారు. నగరంలోని ఇతర ప్రాంతాలకు ఉద్రిక్తత వ్యాపించింది. చాకులు, కత్తులు, బయటకు తీశారు. ఇద్దరు వ్యక్తులను కత్తిపోట్లకు గురిచేశారు. ఒక మసీదు వద్ద ప్రార్ధనా సమయంలో వివాహానికి సంబంధించిన ఊరేగింపు సాగటంతో ఈ ఘర్షణలు ప్రారంభమయ్యాయి. ఎదుటి సమూహాల దాడుల్లో 11 మంది ప్రజలు గాయపడ్డారు. పోలీసులు గత్యంతరంలేని పరిస్థితుల్లో కాల్పులు సాగించారు. గాయపడిన వారిలో ఒకరైన విజయ్‌దత్వానియా ఆసుపత్రిలో చికిత్స పొందుతూ చనిపోవటంతో మరలా హింస చెలరేగింది. మోడీ ప్రభుత్వమే ఈ మతపరమైన హింసకు ప్రధానంగా బాధ్యత వహించాలని పి.యు.సి.ఎల్. ఆరోపించటంతో పాటుగా ఒక ప్రతినిధిబృందం గవర్నర్‌ను కలిసి దీనిలో జోక్యం చేసుకొని హింసను నిరోధించమని కోరింది.

ఏమైనా మతపరమైన హింస ఇతర ప్రాంతాలకు విస్తరించటంతోపాటుగా ఛల్తేపీర్‌కీ దర్గా ప్రాంతంలో ముసుగులు ధరించిన సాయుధ బాలుర గుంపు పోలీస్ స్టేషన్‌కు 15 అడుగుల దూరంలో ఒక స్కూటర్‌వాలా గొంతు కోశారు. దీనికి ప్రతీకార చర్యగా సాయుధ గుంపు పన్నెండు మోటారు సైకిళ్ళను తగులబెట్టారు.

జూన్ 2వ తేదీన అమ్మాయిలను వేధించారనే సమస్యపై గుంపును చెదరగొట్టేందుకు మహారాష్ట్రలోని జలగాన్‌లో, రావార్‌లో మతహింస చెలరేగింది. పోలీసులు మొదట లాఠీఛార్జీ చేసి, తదనంతరం కాల్పులు జరిపారు. 12 మంది వ్యక్తులు రాళ్ళు విసురుకోవటంలోనూ, పోలీసు కాల్పులలోను గాయపడ్డారు. ఈవ్‌టీజింగ్ సంఘటన తదనంతరం ఒక గుంపు మస్తాన్‌షా మసీద్ పై దాడి చేశారు. ముగ్గురు పోలీసులు కూడా ఈ మత ఘటనలో గాయపడ్డారు. ముస్లింలకు చెందిన ఆస్తులపై, పలు షాపులపై ఈ గుంపు దాడి చేసింది.

చనిపోయిన ఆరు ఆవులు రోడ్డుపై పడివున్నాయనే వార్త వ్యాపించటంతో మాలెగావ్‌లో మత అశాంతి నెలకొంది. పోలీసులు సకాలంలో ఈ వార్తలను ఖండిచక పోయివుంటే మాలెగావ్ బ్రద్దలైవుండేది. ఆ ఆవులను ఎవరో చంపటమో, నరకటమో చేయలేదు. వాటిని ఒక చోటునుండి మరోచోటకి రవాణాచేసిన సందర్భంలో ఊపిరాడక మరణించాయి. కొందరు హిందుత్వవాదులు ఇంటర్‌నెట్ ద్వారా తీవ్రంగా గాయపడిన ఆవుల కళేబరాల ఫోటోలను ప్రదర్శిస్తూ హింసను ప్రేరేపించారు. కానీ ఇది ఫలించలేదు. ప్రజలు రెచ్చిపోయేందుకు సిద్ధంకాలేదు.




ఉదయ్‌పూర్ జిల్లాలో శారదా పట్టణంలో జూలై 24-25 తేదీల్లో ఇద్దరు తాగుబోతులైన గుండాలు కొట్లాడుకుంటున్నారు. వీరిలో ఒకరు ముస్లిం కాగా మరొకరు గిరిజనుడు. శారదా పట్టణం ప్రధానంగా గిరిజన ప్రాంతంగా ఉంది. వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్ మరియు బిజెపి ఈ సంఘటనను ఉపయోగించుకొని ప్రతీకారం తీర్చుకోవలసిందిగా గిరిజనులను రెచ్చగొట్టి వారందరికీ ఆయుధాలను అందజేశారు. వారందరూ ముస్లింలు అధికంగా వుండే ప్రాంతంలో జమగూడి 70 ముస్లీంల ఇళ్ళను తగులబెట్టారు. కాంగ్రెస్ పాలిత రాష్ట్రంలో జరిగిన ఈ హింస జిల్లా మెజిస్ట్రేట్, మరియు యస్.పి సమక్షంలోనే జరిగింది. జిల్లాలోని ఆరు గ్రామలోని 500 ముస్లిం కుటుంబాలు నిర్వాసితులయ్యారు. ఒక

కాంగ్రెస్ ఎం.పి మరియు అతని భార్య అయిన ఎమ్.ఎల్.ఏ ఆ ఇళ్ళ కూల్చివేత, దహనం సందర్భంగా అక్కడే వున్నారు. వారుకూడా అదే గిరిజన సమూహానికి చెందినవారు. ఈ సంఘటనపై మానవ హక్కుల కార్యకర్తలు పదేపదే చేసిన విజ్ఞప్తులను పెడచెవిన పెట్టిన ముఖ్యమంత్రి ఒక లౌకిక వాదిగా చెప్పుకునే ఆశోక్‌గెహ్లోట్-యస్.పిపై, జిల్లా మెజిస్ట్రేట్‌లపై ఏవిధమైనప చర్యలూ చేపట్టలేదు. ఏ విధమైన చర్యా తీసుకోక పోవడంపట్ల ముస్లీంలు ముఖ్యమంత్రిపట్ల తీవ్రమైన ఆగ్రహంతో వున్నారు. చర్యతీసుకోకపోగా ఈశాన్యప్రాంత గిరిజనుడైన ఈ యస్.పికి పదోన్నతి కల్పించి బదిలీచేశారు. న్యాయపరమైన విచారణను కూడా ముఖ్యమంత్రి అంగీకరించలేదు. అంతేగాక, తన సర్వస్వాన్ని కోల్పోయిన వారికి తగిన నష్టపరిహారాన్ని కూడా అందజేయలేదు. ప్రభుత్వం అందించే కొద్దిపాటి సహాయాన్ని ముస్లీంలు నిరాకరించగా పోలీసులతో వారిపై వత్తిడి తెచ్చారు.




రాజస్థాన్‌లో బిజెపి అధికారం కోల్పోయిన మొదలు అది తిరిగి అధికారంలోకి వచ్చేందుక మతపరమైన తురుపు ముక్కనుపయోగిస్తున్నది. రాజస్థాన్‌లో మతతత్వ శక్తులను నియంత్రించేందుకు గెహ్లోట్ ఏ మాత్రం ఆసక్తి కనబరచడం లేదని, వారిష్టమొచ్చిన విధంగా వారు వ్యవహరించినా వారిని ఏ విధమైన శిక్షకూ గురిచేయకుండా మిన్నకున్నట్లుగా కనిపిస్తున్నది.

సెప్టెంబర్ 4వ తేదీన మధ్యప్రదేశ్‌లో రాత్‌లామ్‌లో సాధారణంగా శాంతియుతంగా వుండే పట్టణంలో రంగులు వేయబడిన ఒక మసీదుపై కొందరు ఆవుపేడను విసరడంతో మత ఉద్రిక్తలు చెలరేగాయి.

ముస్లింలు ఒక మోటారు సైకిల్‌ను తగులబెట్టారు. దానితో అవతలి మతానికి సంబంధించిన వారు ఆయుధాలతో రోడ్లపైకి వచ్చి మోటారు సైకిళ్ళ్‌ను, మరికొన్ని వాహనాలను తగులబెట్టారు. పట్టణంలో ఒక భాగం హింసాపూరితమైంది. పోలీసులు జోక్యం చేసుకొని యుద్ధానికి సిద్ధమైన రెండు సమూహాలనూ సర్దుబాటు చేశారు.

పశ్చిమబెంగాల్‌లోని 'దేగంగా'లో రాహుల్‌గాంధీ పర్యటనకు ముందుగా సెప్టెంబరు 6వ తేదీన మత హింస చోటు చేసుకుంది. సెప్టెంబర్ 6వ తేదీన దేగంగా హాజీ నూరుల్ ఇస్లామ్ నాయకత్వంలో నాలుగు గంటల పాటు సాగిన గందరగోళం-హిందువుల ఆస్తుల విధ్వంసానికి, ఒక దేవాలయాన్ని అపవిత్రం చేసేందుకు దోవతీశాయి. దీనిపై విచారణకు ఆదేశించారు. సైన్యాన్ని మోహరించినప్పటికీ సెప్టెంబర్ 6న ప్రారంభమైన ఈ విధ్వంసం 9వ తేదీ వరకు కొనసాగింది. కార్తిక్‌పూర్‌లోని ముస్లింల గోరీలదొడ్డి చుట్టుతా గోడ నిర్మించబడింది. హిందువులు దుర్గాపూజ నిర్వహించకుండా దేవాలయ ప్రవేశాన్ని మూసివేయటంతో ఈ చర్యకు పాల్పడినట్టు హిందువులు చెప్పారు. నూరుల్ ఇస్లామ్ పోలీసు స్టేషన్ వరకు ఒక ప్రదర్శన నిర్వహించగా ఈ ప్రదర్శన పొడవునా ఇళ్ళు,షాపులు ధ్వంసం చేయబడ్డాయి.

పోలీసులకు ముస్లిములు ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించదలిచారు. దీనితో మరల హిందువులు ఆయుధాలతో పొగై దాడులకు పాల్పడగా వారంతా దగ్గరలోని ముస్లిముల ఇళ్ళలో తలదాచుకోగా, ఆ ఇళ్ళపై కూడా దాడి జరిగింది. 'కలాసేరీ'లో కొన్ని ఇళ్ళు దెబ్బతినగా ఒక ట్రాక్టరు, టెంపోలను తగులబెట్టారు. పరిస్థితి అదుపు జేసేందుకు పోలీసులు ఆరురౌండ్లు గాలిలోకి కాల్పులు జరిపారు. అయినా కొంత సమయం వరకూ విధ్వంసం ఆగకుండా సాగుతూనే వుంది. లక్షలాది రుపాయల విలువైన ఆస్తులు ధ్వంసమయ్యాయి.

ఈ సారి మతసామరస్యానికి పేరొందిన 'మలేర్‌కోట్ల'లో మతహింస జరిగింది. 'మలేర్‌కోట్ల' నవాబుల పాలనా కాలంలో పదవ గురుగోవిందసింగ్ ముస్లిం పిల్లలను రక్షించిన ఆనాటి నుండీ శిక్కులు, ముస్లింలు సామరస్యంగా కొనసాగుతున్నారు. 1947 దేశ విభజన కాలంలోకూడా మతకల్లోలాలు చోటుచేసుకొన్న సందర్భంలోనూ పంజాబ్‌లోని ఈ ఒక్క జిల్లా నుండే ముస్లింలు పాకిస్తాన్‌కు వలస పోకుండా వుండగలిగారు.

అమెరికాలో ఖురాన్ తగులబెట్టారనే వార్త వ్యాపించగానే సెప్టెంబర్ 12న మత హింస చోటు చేసుకుంది. అమెరికాలోని ఒక క్రిస్టియన్ మతాచార్యుడు ఖురాన్ ప్రతులను తగుల బెట్టిన కారణగా ఈద్‌పండుగ వేడుకల అనంతరం మలేర్‌కోట్లలోని ఒక



చర్చీ విధ్వంసం చేయబడింది. ఆవేశపూరిత గుంపులను అదుపు చేయటంలో పోలీసులు విఫలమయ్యారు. ముఫ్తిఫజూర్ రహమాన్ శాంతి కోసం విజ్ఞప్తి చేస్తూ ఈ ఆందోళనలన్నీ రాజకీయ దురుద్దేశపూరితమైనవిగా పేర్కొన్నాడు. జరిగిన సంఘటలన్నీ పథకం ప్రకారం జరిగినవిగా పేర్కొన్నారు. మలేర్‌కోట్లాలో జరుగుతున్న ఆందోళనల వార్తలు తెలియటంతో లూధియానాలో క్రిస్టియన్లు మొత్తం ఆ ప్రాంతాన్నంతా దిగ్బంధనం చేశారు. అదేవిధంగా లూధియానాలోని జామామసీదువద్ద ముస్లిమ్‌లందరూ సమీకృతమవై అమెరికాలో ఖురాన్‌ను తగులబెట్టటాన్ని నిరసించారు. అదుపు తప్పిన మూకలు పూంచులోని అటవీశాఖ కార్యాలయానికి, రెండు పోలీసు వాహనాలకు నిప్పంటించారు. దీనితో పోలీసులు గాలిలోకి కాల్పులు జరిపి, భాష్ప వాయువు ప్రయోగించటంతో నలుగురు గాయపడ్డారు. జమ్మూ ప్రాంతంలో ఈ గుంపు బరాక్ ఒబమా దిష్టిబొమ్మలను దగ్ధం చేశారు.

రాజస్థాన్‌లోని ఝలవాద్ జిల్లాలో సెప్టెంబర్ 20వ తేదీన ముగ్గురు ముస్లిమ్ యువకులు ఒక గిరిజన బాలికపై అత్యాచారం జరపటంతో సంఘపరివార్ శక్తులచే రెచ్చగొట్టబడిన గిరిజనులు మనోహర్ ధానా మరి కొన్ని గ్రామలను దోచుకున్నారు. మతహింస చోటుచేసుకుంది. ముస్లిములలో ఎక్కువ భాగం సర్వాస్వాన్నీ కోల్పోయి, కట్టుబట్టలతో మనోహర్‌థానాను విడిచిపెట్టవలసి వచ్చింది. మిగతా అంతా దోచుకోబడటమో, తగులబెట్టబడటమో జరిగింది. డిసెంబరు 12వ తేదీన ఉదయపూర్ జిల్లా శారద గ్రామంలో ఈ వ్యాసకర్తతో సహా మరికొందరు బాధితుల గాధలు విన్నారు. మనోహర్ థానాలో కూడా పోలీసులు సరైన విధంగా వ్యవహరించక, గిరిజనులు సాగించే విధ్వంసాన్ని కొనసాగనిచ్చారు.

సంఘ పరివార్ శక్తులు, గిరిజనులను, దళితులను మతతత్వీకరించి మత హింసకు పాల్పడేందుకు ఉపయోగిస్తున్నారు. మనోహర్‌థానాలో బి.జె.పి లోని రెండు ముఠాలు పాల్గొన్నాయి. ఈ విధంగా రాజస్థాన్‌లోని మనోహర్ థానాలో జరిగిన మత పరమైన హింసకు బి.జె.పిలో అంతర్గతంగావున్న ముఠాతత్వము కూడా ఒక కారణంగా వుంది. రాజస్థాన్‌ను కూడా గుజరాత్‌గా మర్చేందుకు బిజెపి తన ప్రయత్నాలన్నింటినీ తీవ్రంచేస్తుండగా పాలకవర్గ కాంగ్రెస్ పార్టీ తన ప్రయోజనాల రీత్యా తీవ్ర ఉపేక్షను వహిస్తున్నది.

*(సెక్యులర్ పర్‌స్పెక్టివ్ సౌజన్యంతో)*

**క్యాంపస్ వాయిస్‌పై మీ అభిప్రాయాలు తెలపండి. ప్రచురణకై సమకాలీన అంశాల మీద వ్యాసాలు, పుస్తక సమీక్షలు, సాహిత్య వార్తలు, కవితలు, పాటలు వ్రాసి పంపండి. మీ రచనలు కాగితానికి ఒకే వైపు స్పష్టంగా, అర్థమయ్యేలాగా రాసి పంపండి. మీ చేతిరాత అస్పష్టంగా ఉంటే తప్పులు దొర్లే ప్రమాదం ఉంది.**

**-ఎడిటర్**

# శ్రీకృష్ణ కమిటీ కాదు దుగ్గల్ కమిటీ ఇది!

- ప్రొ॥మాడభూషి శ్రీధర్

అడుగడుగునా గందరగోళం నింపి హోంశాఖకు కావలసిన నివేదిక ఇచ్చి తెలంగాణా సమస్యను మరింత జటిలం చేసిన శ్రీకృష్ణ కమిటీ స్వరూపం ఏమిటి? దానికున్న చట్టబద్ధత ఏమిటి? దాని నివేదిక ఏం సాధించగలుగుతుంది? తెలంగాణా సమస్యపై రగులుతున్న రాష్ట్రాన్ని ప్రశాంతంగా ఉండాలన్న పేరుతో హోం మంత్రిత్వ శాఖ ఏర్పాటుచేసిన కమిటీని ఏమనాలి? శ్రీకృష్ణ కమిటీ తెలంగాణా కమిటీ కాదు. దాని పేరులోనే తెలంగాణా లేకుండా చూసుకున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితిపై సంప్రదింపులుచేసే కమిటీ అని దానికి హోం శాఖ పెట్టిన పేరు. ఇది విచారణా కమిషన్ల చట్టం కింద ఏర్పాటయిన నిజనిర్ధారణ కమిషన్ కాదు. మాజీ సుప్రీంకోర్టు న్యాయమూర్తి అధ్యక్షత వహించినంత మాత్రాన అది న్యాయవిచారణా సంఘంకాబోదు. ఈ కమిటీ ఏర్పాటుకు కేంద్రం ఒక చట్టం చేయలేదు కనుక ఇది చట్టబద్ధమైన కమిటీ కూడా కాదు. ఈ కమిటీకి నిజాన్ని నిర్దేశించేందుకు దీనికి సివిల్ కోర్టు హోదాకూడా ఇవ్వలేదు.



### ఏ బాధ్యతలు ఇచ్చారు?

నిజానికి ఈ కమిటీ ముందు కనీసం ఒక సమస్యకు పరిష్కారాన్ని సూచించడానికి శాస్త్రీయ విధానాలను అనుసరించే అవసరాన్ని చూపలేదు. ఆ బాధ్యత కూడా దాని మీద మోపలేదు. దాని ముందు సమస్యలుకూడా సరిగ్గా ఉంచలేదు. అధ్యయనం చేయడం, సంప్రదింపులు జరపడం దానిపని. తోచిన సిఫార్సులు చేయడం కూడా చేయవచ్చు. తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగా ఇవ్వడం గురించి మాత్రమే కాకుండా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఈ విధంగానే కొనసాగించడమా? అనే ప్రశ్నకు కూడా అధ్యయనం చేయాల్సి ఉంటుంది. ఈ అధ్యయనం ఏవిధంగా చేయాలనేది వారు స్వయంగా నిర్ణయించుకోవాలి. కాని వారు అధ్యయనం విధానాన్ని ప్రకటించలేదు. సంప్రదింపులు జరుపుతున్నాం రండి అని వచ్చి చెప్పండి అని పత్రికల్లో ప్రచటనలు చేసారు. కాని తమ ముందుకు వచ్చిన నివేదికలను ఏం చేస్తారో చెప్పలేదు. నివేదికలో అంశాల్లో నిజానిజాలను ఏవిధంగా లెక్కిస్తారో చెప్పలేదు. ఎవరిచ్చిన పత్రాలైనా స్వీకరించి, దాన్ని ఏవిధంగానైనా అన్వయించి, ఏరకమైన వ్యాఖ్యానమైనా చేసి, ఏ సిఫార్సయినా ఇస్తానన్నట్టు వ్యవహరించింది. కాని ఆ అశాస్త్రీయ విధానాన్ని అనుసరిస్తునట్టు ముందే చెప్పలేదు. ఈ కమిటీ నిజస్వరూపం న్యాయవిచారణ కాకపోయినా ఒక పద్ధతి ప్రకారం అంశాలను అధ్యయనం చేయాల్సిన మౌలిక నైతిక బాధ్యత ఉంటుంది. రాష్ట్ర శాసనసభ చట్టం ద్వారానైనా దీనికి చట్టబద్ధత కల్పించే ప్రయత్నం చేయలేదు. చివరకు దీని విలువ ఏమంటే ఒక హోం డిపార్ట్‌మెంట్ వారు వేసిన డిపార్ట్‌మెంటల్ కమిటీ. ఒక ముక్కలో చెప్పాలంటే హోం శాఖ వారి హోం కమిటీ, దీనికి పెద్ద బాస్ హోం మంత్రి. ఆ శాఖ నియమించిన సభ్య కార్యదర్శి వి.కె. దుగ్గల్ దీనికి చిన్న బాస్.

### న్యాయసూత్రాలు బుట్టదాఖలు:

ఎంతో స్వతంత్రంగా వ్యవహరిస్తారని కొందరు ఆశించిన జస్టిస్ శ్రీకృష్ణ ఒక ఉత్సవ విగ్రహంగా ఉండడానికి అంగీకరించడం, అలంకార ప్రాయంగా ఇతర సభ్యులు వ్యవహరించడానికి సమ్మతించడం అనైతిక పాలనా వ్యవహారాల్లో ఒక విషాదం. చివరకు ఏ శాస్త్ర విధానాన్ని, పరిశోధనా పద్ధతులను పాటించకుండా, తమ ముందున్న విచారణాంశాలపై వచ్చిన సమాచారాన్ని క్రాస్ ఎగ్జామినేషన్ చేయకుండా మరే ఇతర పద్ధతిలోనూ పరిశీలించకుండా,. ఖచ్చితంగా ఒక లెక్క ప్రకారం సేకరించిన గణాంక వివరాలను మాత్రమే తీసుకోవలసిన ప్రాథమిక బాధ్యతను కూడా ఈ కమిటీ పాటించకుండా కమిటీ నివేదికను రూపొందించింది. సహజ ప్రాథమిక న్యాయసూత్రాల ప్రకారం తమ ముందుకు వచ్చిన అంశాలను నిష్పాక్షికంగా పరిశీలిచడానికి, నిజం నిగ్గు తేల్చడానికి చేయవలసిన ప్రయత్నాలేవి చేయలేదు. ఏ అంశంపైన రెండు పక్షాలను వినలేదు. ఒక పక్షం వాదనను మరోక పక్షంతో క్రాస్ ఎగ్జామిన్ చేయలేదు. ప్రభుత్వ పక్షపాతాన్ని వీడలేదు. మరో పక్షాన్ని వినలేదు. తెలంగాణా గురించి తెలంగాణా వ్యతిరేక ప్రభుత్వం ఇచ్చిన తప్పుడు అంకెలను, సమచారాన్ని ఏవిధమైన

క్రాస్ చెక్ లేకుండా దానికి కనీసం తెలంగాణా వాదుల సమధానాన్ని గానీ, అందులో ఉన్న అబద్ధాలను ఎత్తిచూపే అవకాశం గానీ ఇవ్వకుండా వాటినే నమ్మి, ప్రభుత్వానికి కావలసిన రీతిలో నివేదికలు రాయడానికి అనుకూలమైన వ్యక్తులకు ఔట్ సోర్స్ చేసి వారు ఇచ్చిన నివేదికలో తప్పులు కూడా సరిదిద్దకుండా వాటిని వరుసలో పేర్చి తొమ్మి అధ్యాయాలున్న తమ నివేదికగా మార్చి హోం మంత్రికి ఇచ్చారు. దీన్ని కమిటీ రాసిందో లేక కనీసం చదివిందో లేదు తెలియదు. అందరూ సంతకాలు మాత్రం చేసారు. ఎన్నో విలువైన పిటిషన్లను కమిటీ చెత్తబుట్టలో వేసింది. ఎన్నో నిజాలను ప్రస్తావించకుండా వదిలేసింది. సమగ్ర నివేదిక ఇవ్వడం తమ బాధ్యత అని కమిటీ మరిచిపోయింది.

**తప్పుల తడక - అంకెల గారడీ:**

ఇక తప్పులకు అంతులేదు. ఘోరాలు కూడా ఎక్కువే. నదులు, వానిమీద ప్రాజెక్టుల పేర్ల రచనలో నిర్లక్ష్యం. చారిత్రక అసత్యాలు రాయడంలో సిగ్గుపడకపోవడం, అంకెల గారడీ ద్వారా మసిబూయడం...ఎన్నో అసమంజసమైన వ్యాఖ్యలు, డబ్బు వ్యాపారం తప్ప జనం వారి సమస్యలు తమకు అనవసరమనే ఒక బ్యూరోక్రాటిక్ ధోరణిని అనేక వ్యాక్యాల్లో ప్రదర్శించిందీ నివేదిక. తెలంగాణాతో పోల్చి ఆంధ్రకు ఎక్కువ అభివృద్ధి జరిగిందని చెప్పవలసి రాగానే అది ఎందుకో సమర్థించడానికి అయిదారు పేరగ్రాపులు రాయడం, అదే తెలంగాణకు అంకెల ఆధిక్యత వచ్చినపుడు, చూసారా ఎంత అభివృద్ధో అని వదిలేయడం వంటి మేధో అనైతికతకు పాల్పడింది ఈ కమిటీ.

ఎంత ప్రయత్నం చేసినా శ్రీ కృష్ణ కమిటీ తెలంగాణా రాష్ట్ర డిమాండ్ అన్యాయమైందని చెప్పలేకపోయింది. ఎంత గాఢంగా ప్రభుత్వానికి అనుకూలమైన సిఫార్సు ఇవ్వడం కోసం కష్టపడినా, ఆంధ్రప్రదేశ్‌ను సమైక్యంగా ఇప్పుడున్న రీతిలో కొనసాగించడం ఆచరణాత్మకం కాదని చెప్పక తప్పలేదు. తెలంగాణాను సీమాంధ్ర నాయకత్వంలోని ప్రభుత్వాలు అన్యాయం చేసాయని అభివృద్ధిలో వివక్షకు గురిచేసాయని ఈ నివేదికలో రాయలేదు. అలా అని వారు న్యాయం చేసారని కూడా రాయలేదు. తెలంగాణాలో అభివృద్ధి లేదనే వాదాన్ని తిరస్కరించడానికి గట్టి ప్రయత్నం చేసిన పచ్చి నిజాలు కంటిముందు కనిపిస్తుంటే కప్పిపుచ్చడం సాధ్యం కాక కమిటి తికమక పడింది. తెలంగాణాలో అభివృద్ధి జరిగిందని చెప్పడానికి అంతకన్న వెనుకబడి ఉన్న జిల్లా లెక్క తీసింది. రోడ్ల పొడుగు, వాహనాల కొనుగోలు, ప్రయివేటు విద్యాసంస్థల సంఖ్య, విద్యుచ్ఛక్తి వినియోగం ఆధారంగా అంకెల తెలంగాణాకే అనుకూలంగా ఉన్నాయని, వారు అభివృద్ధి ఇత ప్రాంతాలకు దీటుగా ఉందని వాదించడానికి నాన తంటాలుపడింది. రోడ్ల వెడల్పు, పొడుగు వల్ల వ్యాపారం పెరిగి పెరగవచ్చు. దాంతో పాటు. ఆక్సిడెంట్లు కూడా పెరగవచ్చు వాహనాల కొనుగోలు ఏ తరగతిని బాగుచేస్తుందో కమిటీ తెలియదా? పేదరికం ఎంత పెరిగిందో, పేదలకు ధనికులక మధ్య వ్యత్యాసం ఎంత పెరిగిందో చెప్పవలసిన బాధ్యత కమిటీ లేదా? ప్రయివేటు విద్యాసంస్థల సంఖ్య పెరిగిందని చెప్పే కమిటి అవి ఎందరి ఆంధ్ర వర్తకుల చేతిలో ఉందో ఎందుకు చెప్పలేదు అందులో కనీసం ఉద్యోగులు తెలంగాణా వారు ఎంత తక్కు మంది ఉన్నారో ఎందుకు చెప్పలేక పోయింది. ఈ అంకె పెరగడంలో ప్రభుత్వం తెలంగాణాకు చేసిందేమిటో ఎందుక విశ్లేషించలేదు. కాలువ నీరందని పొలానికి బోరుబావు ఒక్కటే దిక్కని డ్రిల్లింగ్ చేయడం, అది ఎండిపోవడం, మరో బావి తవ్వడం అదీ నిరు ఇవ్వకపోవడం... ఈ విధంగా ఒక ఎకరాకు నాలుగైదు గొట్టపు బావులు తవ్వుకుని మోటార్లు అమర్చుకుంటే విద్యుచ్ఛక్తి వినియోగం తెలంగాణా రైతుకు ఎక్కువ ఉంటుంది. నిరంతరం కాలువ నీటితో సాగుచేసుకుంటూ ఏటా మూడు పంటలకు నీరు అందించే గ్యారంటీ ఉన్న కోస్తాంధ్ర రైతులకు గొట్టపుబావులు కరెంటుమోటార్లు అవసరం లేదు. కనుక వారి విద్యుచ్ఛక్తి వినియోగం తక్కువే ఉంటుంది. కాని ఆ రైతుల ఇళ్లలో, వారికి రాజధానిలో ఉన్న ఎసి గదుల ఇళ్లలో ఎంత విద్యుచ్ఛక్తి కాలుతుందో కమిటి లెక్క వేసి ఉంటే విద్యుచ్ఛక్తి వినియోగంలో కూడా తెలంగాణా



రైతు ఎంత వెనుకబడి ఉన్నాడో తెలిసిపోయేది. కాని ఆ పని చేయడం శ్రీకృష్ణ కమిటీకి ఇష్టం లేదు. ఈ దొరికిన అంకెలతో అబద్ధాల గొడ కట్టాలే అన్యాయానికి పాల్పడింది. వృద్ధి రేటు అంకెలను ఎటుబడితే అటు వాడుకోవచ్చు కనుక తెలంగాణాకు అన్యాయం చేయడానికి వాడుకుంది శ్రీకృష్ణ కమిటీ. అయినా విద్య, అక్షరాస్యత, వైద్యం, సేద్యపునీటిరంగం, మౌలిక వనరుల కల్పనలో తెలంగాణా వెనుకబడిందని కమిటీ అంగీకరించ తప్పలేదు. ఇంత కీలకమైన రంగాల్లో వెనుకబడి ఉన్న విషయం తెలిసిన తరువాత కూడా తెలంగాణా అన్యాయానికి గురైందని చెప్పడానికి కమిటీకి మనసొప్పలేదు. వారి మనసును ఎవరు దోచుకున్నారు. ఏవిధంగా? చదువులో, వైద్యంలో, సాగునీటి రంగంలో వెనుకబడి ఉన్న ప్రాంతం కోస్తాంధ్రతోదీటుగా అభివృద్ధి చెందిందనడానికి కమిటీ సభ్యులు కొంచమైన సిగ్గుబడితే వారి పరువు దక్కలేదు.

తెలంగాణాను దోపిడీచేసామన్న నిందనుంచి సీమాంధ్రను తప్పించడానికి ఎంత ప్రయత్నంచేసినా ఫలితంలేదు. కాని తమను ఆ నిందనుంచి తప్పించిందని కమిటీని ప్రశంసించడానికి వీలైన కొన్ని వ్యాక్యాలను ఈ నివేదికలో అక్కడక్కడ ఉప్మాలో జీడిపప్పు చల్లినట్టు చల్లారు. ఈ వ్యాక్యాలతో కోస్తాంధ్ర సీమల్లో నేతలు ఆనందంతో ఉప్పొంగిపోతున్నారు. వెనుకబడిందని చెప్పడానికి కావలసిన సాక్ష్యాలున్నా కమిటీ వదిలేసింది. అందుకు తెలంగాణా నుంచి విమర్శలు చెలరేగుతున్నాయి. ఒక శాస్త్రీయమైన విధానాన్ని అనుసరించకపోవడం వల్ల ఈ కమిటీ ఈ విధంగా ఇష్టం వచ్చినట్టు హోం శాఖ అభిప్రాయాలను తమ పరిశోధనా ఫలితాలుగా రాయడానికి వీలుపడింది. ఈ వ్యవహారపరమైన లోపాలతోపాటు కమిటీ కొన్ని ఘోరమైన దోషాలకు కూడా పాల్పడింది.

**దుగ్గల్ రహస్యాలు, రహస్య నివేదికలు:**

తెలంగాణా ఉద్యమం పట్ల ఈ హోం కమిటీ తనకున్న దురభిప్రాయాలతోపాటు రహస్యాన్ని పెంచి పోషించే దుర్మార్గానికి కూడా వెనుకాడలేదు. ఈ నివేదికలో తొమ్మిదో అధ్యాయం సూచనలు పరిష్కారాలకు సంబంధించింది. ఇది చాలా కీలకమైన అధ్యాయం. కాని దీనికి అధారమైన అధ్యాయం ఎనిమిదోది. దీన్ని లా అండ్ ఆర్డర్ అధ్యాయం అని పిలుచుకున్నారు. కేవలం అరపేజి మించదీ అధ్యాయం. ఇది 413వ పేజీలో ఉంది. ఇందులో ఏ వివరాలు లేవు. కాని ఒక కీలక సమాచారం ఉంది. అదేమంటే... ఈ కమిటీ సభ్య కార్యదర్శి అయిన వి.కె. దుగ్గల్ (హోం శాఖ మాజీ ఉన్నతాధికారి) ఈ రాష్ట్రంలోని 17 జిల్లాల సీనియర్ అధికారులు, పోలీసు అధికారులతో ముఖాముఖి చర్చలు జరిపారు. ఆ చర్చల ఆధారంగా కార్యదర్శి కమిటీకి కొన్ని విషయాలు చెప్పారు. ఆవిధంగా ఆయన చెప్పిన వివరాలు ఇతరత్రా అందిన సమాచారం అధారంగా కమిటీ ఒక నివేదిక తయారుచేసింది. ఈ నివేదిక (505 పేజీల నివేదిక) తోపాటు డిసెంబర్ 30న శ్రీ కృష్ణ ఒక సీల్డు కవర్‌లో ఇచ్చారు. ఆ అధ్యాయం ఆధారంగానే తాము తొమ్మిదో అధ్యాయంలో సూచనలు సిఫార్సులు రూపొందించాం అని ఆ అరపేజీ అధ్యాంలో వివరించారు. దీని అర్థం ఏమిటి? 17 జిల్లాల అధికారులతో మాత్రమే మాట్లాడారు. ఆరు జిల్లా అధికారుల విషయం ప్రస్తావనే లేదు. ఆ జిల్లాల్లో ఉన్నది మనుషులు కారా? అవి ఏ జిల్లాలో తెలియదు. వారిని ఎందుకు వదిలేసారో అర్థం కాదు. దాని గురించి నివేదికలో రాయరు. కనీసం ఈ 17 జిల్లాల అధికారులైనా లిఖిత పూర్వకంగా ఇచ్చారా అంటే లేదు. వారు ముఖాముఖి చెప్పారట. కనీసం వారు మొత్తం కమిటీ ముందైనా నివేదిక ఇచ్చారా అంటే అదీ లేదు.

**ఎవరిదీ రహస్య ఎజెండా?:**

ఎజెండాలో, టర్మ్స్ ఆఫ్ రిఫరెన్సులో కమిటీలో సభ్యులు తమ ముందుకు వచ్చిన వారితో ముఖాముఖి మాట్లాడాలని రాసుకున్నారు. అంటే దాని అర్థం కమిటీ సభ్యులు కూర్చుని ఒక పబ్లిక్ హియరింగ్ జరిపినట్టు జరపాలని, వినతి పత్రం ఇచ్చిన వారిని సంప్రదించాలని, వారిని ప్రశ్నలు వేసి మరింత పరిశీలన జరపాలని అర్థం. కాని దుగ్గల్ 17 జిల్లాల అధికారులతో మాట్లాడిన అంశాలే తమ ముందుకు వచ్చిన అంశాలుగా కమిటీ ఎందుకు భావించింది. ఆ 17 జిల్లాల అధికారులు ఏం చెప్పారు. దాన్ని దుగ్గల్ యధాతథంగా చెప్పారా? అనే ప్రశ్నలకు సమాధానం లేదు. మొత్తం తుది సిఫార్సుల అధ్యాయం చాలా వరకు 8వ అధ్యాయం పైన ఆధారపడినప్పుడు, ఈ మౌఖిక సమాచారం నమ్మతగినదేనా? ఇక్కడ హోం శాఖ పట్ల పక్షపాతం, అపారమైన విధేయతలను ఈ కమిటీ ప్రదర్శించింది. ఈ కమిటీముందు హాజరై ఎంతో నమ్మకంతో తమ అభిప్రాయాలు పరిశోధనా పత్రాలు సమర్పించిన జన నాయకులకు, రాజకీయ పార్టీల ప్రతినిధులకు ఇది తిరస్కారం వంటిదే. ప్రజా నయకులంతా బహిరంగంగా నివేదికలు లిఖితపూర్వకంగా ఇచ్చి, జస్టిస్ ప్రశ్నలకు ఇతర సభ్యుల ప్రశ్నలకు సమాధానం చెప్పి వెళ్ళాలి. అయినా ఆ నివేదికలకు అతీగతీ ఉండదు. మరోవైపు కమిటీ ముందు కాకుండా ఒక కార్యదర్శి ముందు 17 జిల్లాల సీనియర్ అధికారుల నోటిమాటగా చెప్పిన రహస్యాలకు ఎంతో విలువ ఉంటుంది. ఆ రహస్యాలు ఆధారంగా ఇచ్చిన అధ్యాయం రహస్యంగా ఉంటుంది. కనీసం ప్రజా ప్రతినిధులకు, పార్టీ నేతలకు, అఖిల పక్ష సమావేశంలో కూడా ఆ సీల్డు కవరు నివేదిక ఇవ్వరు. వారికీ ఇది అవమానమే. కమిటీ అధ్యక్షుడిగా ఉన్న మాజీ న్యాయమూర్తి జస్టిస్ శ్రీకృష్ణ దీనికి అంగీకరించడం, తన ముందుకు రాని అంశాలను తన కమిటీ నివేదికలో చేర్చడం, హోం శాఖ పట్ల ఆయనకు ఉన్న విధేయతను



ప్రతిబింబిస్తుందే కాని, స్వతంత్రుడైన న్యాయమూర్తి ఆయనకు కీర్తిని తేజాలదు. పైగా ఈ సంఘటనను బట్టి ఆయన ఇదివరకు ఇచ్చిన తీర్పుల్లో న్యాయం పైన అనుమానాలు వచ్చే అవకాశం కూడా ఉంది. తన స్వతంత్రతను, విశ్వసనీయతను ఫణంగా పెట్టి ఈ రహస్య రక్షణ చేయడానికి ఏ మాజీ న్యాయమూర్తి కూడా అంగీకరించకూడదు.

**పరిష్కారాల గందరగోళం:**

మొదటి పరిష్కార సూచన ప్రకారం తెలంగాణా సమస్య ఒక లా అండ్ ఆర్డర్ సమస్య. కేంద్రం జోక్యం లేకుండా రాష్ట్రమే ఈ సమస్యను పరిష్కరించాలి. కేంద్రం ఇదివరకే బలగాలను పంపి జోక్యం చేసుకుంది. కాని అది కమిటీ పట్టించుకోదు. యథాతథంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని కొనసాగించాలని ఈ సూచన చేసారు. కాని ఇది ఆచరణ సాధ్యం కాదని కమిటీయే పేర్కొంది. అయినా రాజకీయ పరిణామాలను పరిశీలిస్తే కేంద్రం ఈ యథాతథ కొనసాగింపునకు ఓటు వేస్తుందేమోననిపిస్తున్నది.

కమిటీ చేసిన సూచనల్లో 2,3,4,5 రాష్ట్ర విభజనకు అనుకూలంగా ఉన్నాయి. 6వ సూచన తెలంగాణాకు రాజ్యాంగబద్ధమైన రక్షణలు కల్పిస్తూ రాష్ట్రాన్ని కొనసాగించడం, తెలంగాణా, సీమాంధ్రగా రాష్ట్ర విభజన, హైదరాబాద్‌ను కేంద్రపాలితప్రాంతం చేసి రెండు రాష్ట్రాలకు ఉమ్మడి రాజధానిగా కూడా కొనసాగేట్టు చూడడం, లేదా కోస్తాంధ్ర, రాయల తెలంగాణాగా వేర్పాటు చేసి హైదరాబాద్‌ను రాయల తెలంగాణా రాజధానిగా ఉంచడం అనే 2,3 సూచనల సమంజసత్వం కూడా సందేహాస్పదమే అని కమిటీ తేల్చింది. ఇక నాలుగో సూచన, హైదరాబాద్ విస్తీర్ణాన్ని పెంచి ఇతర తెలంగాణా జిల్లాలోని అనేక మండలాలను దీంతో కలిపి, దాన్ని కేంద్ర పాలిత ప్రాంతంగా ప్రకటించడం, మూడు రాష్ట్రాలకు మూడు రాజధానులను విడిగా నిర్మించుకోవడం అనేది. ఇదోక దారుణమైన సూచన. ఎవరూ అడగనిది, ఎవరూ ఊహించనిది. అమలు చేయాలో వద్దో కమిటీ కూడా చెప్పలేకపోయిన అసమంజసమైన సూచన ఇది.

ఒక అయిదో సూచన, తెలంగాణా, సీమాంధ్రగా రాష్ట్ర విభజన, తెలంగాణాలోనే హైదరాబాద్ రాజధానిగా కొనసాగడం, సీమాంధ్ర కొత్త రాజధాని నిర్మించుకునే వరకు హైదరాబాద్ రాజధానిగా ఉపయోగించడం. కాని దీనికి కొన్ని షరతులు విధించారు. లా అండ్ ఆర్డర్ సమస్యగా భావించి తెలంగాణా ఉద్యమాన్ని చాలా వ్యూహాత్మకంగా, కఠినంగా, తెలివిగా ఎదుర్కొనడం సాధ్యం కాకపోతేనే ఈ సూచనలను అమలు చేయాలన్నారు. అందరి ఆమోదం ఉంటే ఈ పనిచేయాలన్నారు. తెలంగాణాలో ఆంధ్రుల ఆస్తులకు రక్షణ కల్పించిన తరువాతనే ఈ విభజన చేయాలన్నారు. అందరి ఆమోదం సాధ్యం కాదని వేరే చెప్పనవసరం లేదు. రక్షణ కల్పించడం అవసరం. కాని ఉద్యమాన్ని అణచడం సాధ్యం కాకపోతేనే ఈ సూచన గురించి ఆలోచించాలని చెప్పడం ద్వారా శ్రీకృష్ణ కమిటీ లాఠీ బుద్ధితో నివేదిక రాసిందే కాని న్యాయమైన ఆలోచనేచేయలేదని తేలిపోయింది. ఆరోసూచన సాధ్యంకాపోతే అయిదో సూచన రెండో ఉత్తమ అని కమిటీ వర్ణించింది. ఆరో సూచన ఏమంటే ప్రయోగించి విఫలమైన తెలంగాణా ప్రాంతీయ మండలికి మళ్లీ రాజ్యాంగ ప్రాణం పోయడం, దానికో అసెంబ్లీని ఏర్పాటు చేయడం, అక్కడి నివేదికలను తీర్మానాలను రాష్ట్ర శాసనసభలో ఉంచడం, మండలి అసెంబ్లీకి, రాష్ట్ర అసెంబ్లీకి విభేదాలు వచ్చినా, మండలి తీర్మానాలకు ప్రభుత్వానికి మధ్య విభేదాలు వచ్చిన వివాదాన్ని గవర్నర్ కమిటీకి పంపడం, ఈ కమిటీ రెండు ప్రాంతాలను సమప్రాతినిధ్యం ఇచ్చి, గవర్నర్‌కు కాస్టింగ్ ఓటు ఇవ్వాలనడం ప్రధాన అంశాలు. గవర్నర్ తన విచక్షణతో నిర్ణయిస్తారన్నమాట, పెద్దమనుషుల ఒప్పందాన్ని ఈ ప్రతిపాదన ద్వారా మళ్లీ తెరముందుకు తీసుకొస్తారట. ఇదొక ప్రజాస్వామిక ప్రతిపాదన. ఇది వరకు విఫలమైందనడానికి అనేక రుజువులు ఉన్న ఈ ప్రయోగాలను మళ్లీ చేయాలనడం ఎంత వరకు వివేకవంతమో? హైదరాబాద్ కేంద్రపాలిత ప్రాంతంగా ప్రకటించాలనడం ఈ చారిత్రక నగరాన్ని ఢిల్లీ సుల్తానులకు అప్పగించడమే. ఇది రాజ్యాంగ ఫెడరల్ సూత్రాలకు కూడా విరుద్ధమే. అందరికీ సంతృప్తిని కలిగించే నివేదిక ఇస్తామన్నపుడే ఇది తెలంగాణా వ్యతిరేక నివేదిక అని తేలిపోయింది. ఎవరికీ తృప్తిని కలిగించని ఈ నివేదిక సమస్యను సాగదీసి ఆంధ్ర తెలంగాణా ప్రజల మధ్య విద్వేషాల అగ్నిని వెదజల్లే ఇంధనంగా మారింది.

*(వ్యాసకర్త నల్సార్ న్యాయ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులు)*

# 'అఖిలపక్షం', 'ఏకాభిప్రాయం' కాదు కావాల్సింది తెలంగాణా రాష్ట్రం ఏర్పాటు మాత్రమే

-కె. గోవర్ధన్

కేంద్ర ప్రభుత్వం మళ్ళీ తెలంగాణాకు ద్రోహం చేయజూస్తున్నది. అఖిలపక్ష సమావేశాల పేరిట, ఏకాభిప్రాయ సాధన పేరిట అంతులేని కాలయాపన కొడిగడుతున్నది. 2009 డిసెంబర్ 9న భారత ప్రభుత్వం తరపున హోం మంత్రి చిదంబరం చేసిన ప్రకటనకు కట్టుబడి తెలంగాణా రాష్ట్ర ఏర్పాటుకు పూనుకోవడం లేదు. శ్రీకృష్ణ కమిటీ పేరిట సంవత్సర కాలంపాటు కాలయాపన కొడిగట్టిన తర్వాత ఒక స్పష్టమైన నిర్ణయాన్ని వెలువరించడం లేదు.



గత సంవత్సరం డిసెంబర్ 30న గడువుకు ఒక రోజు ముందే తన నివేదికను శ్రీకృష్ణ కమిటీ కేంద్ర ప్రభుత్వానికి అందజేసింది. ఆ తర్వాత కూడా కేంద్రం పార్లమెంట్ బడ్జెట్ సమావేశాల్లో తెలంగాణా బిల్లు పెట్టే వైపుగా ఆలోచించకుండా ఏకాభిప్రాయ సాధన అంటూ సరికొత్త కుట్రను మళ్ళీ ముందుకు తెస్తున్నది. అఖిలపక్ష సమావేశాల్లో పార్టీల అభిప్రాయాన్ని తెలుసుకోవాలని రాసి పోయిన తన పాత రికార్డునే మళ్ళీ మళ్ళీ వినిపిస్తోంది. నాలుగు కోట్ల తెలంగాణా ప్రజల ప్రజస్వామిక ఆకాంక్షను సాకారం చేయకుండా లాభనష్టాల వేటలో మునిగి తేలుతున్నది. సీమాంధ్ర పెట్టుబడిదారీ, పెత్తందారీ, స్వార్థపూరిత శక్తులకు కేంద్ర సర్కార్ మరోసారి తలొగ్గుతున్నది. నిజాయితీ లేకుండా, వెన్నెముక లేకుండా వ్యవహరిస్తున్నది.

శ్రీకృష్ణ కమిటీ నివేదికను అధ్యయనం చేసే పేరిట, దీనిపై రాష్ట్రంలోని 8 రాజకీయ పార్టీల అభిప్రాయాలను తెలుసుకొని, ఏకాభిప్రాయం సాధించే పేరిట కేంద్రం మళ్ళీ నక్కజిత్తుల మోసపు ఎత్తుగడలకు పూనుకుంటున్నది.

**శ్రీకృష్ణ కమిటీ, దాని రిపోర్టులతో తెలంగాణాకు పనేలేదు!**

తెలంగాణా రాష్ట్ర ఏర్పాటుకుగాను భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 3 ప్రకారం కేంద్రం పార్లమెంట్‌లో బిల్లు పెట్టాలి. స్వయంగా తానే సంవత్సరం క్రితం "తెలంగాణా రాష్ట్ర ప్రక్రియ ప్రారంభమవుతుందని" చేసిన ప్రకటన ప్రకారం రానున్న బడ్జెట్ సమావేశాల్లో ఈ బిల్లును పెట్టాల్సిన అవసరముంది. తెలంగాణా ప్రజలు కోరుతున్నది ఇంతే తప్ప శ్రీకృష్ణ కమిటీని గానీ, దాని నివేదికను కాదనీ ఇప్పటికే అనేక పర్యాయాలు ప్రకటించివున్నారు.

శ్రీకృష్ణ కమిటీని వేసినప్పుడు గానీ, దాని విధివిధానాలను రూపొందించినప్పుడు గానీ తెలంగాణా జేఏసీ, సిపిఐ (ఎం.ఎల్) న్యూడెమోక్రసీ లాంటి పార్టీ, ప్రజా సంఘాలుగానీ ఇదే విషయాన్ని పదేపదే ప్రకటిస్తూ వచ్చాయి. శ్రీకృష్ణ కమిటీ కేవలం కాలయాపనకుద్దేశించిన కమిటీయే తప్ప దీనితో తెలంగాణా రాదని సైతం ఈ సంస్థలు స్పష్టంగా ప్రకటించే వున్నాయి కూడా. అంతేకాదు, కమిటీ రిపోర్టు వెలువడింతర్వాత సైతం ప్రారంభంలో తెలంగాణా జేఏసి, టీఆర్ఎస్ లు కొంత మెత్తగా మాట్లాడినా సిపిఐ (ఎం.ఎల్) న్యూడెమోక్రసీ, ఇతర ప్రజాసంఘాలు, ఉద్యోగుల,న్యాయవాదుల, డాక్టర్ల సంఘాలు, శ్రీకృష్ణ కమిటీ నివేదిక దాని సిఫార్సులు తెలంగాణను సాధించడానికి ఉపయోగపడవని కచ్చితంగా చెప్పాయి. తెలంగాణాను బొందపెట్టడానికేనని ఏలాంటి శషభిషలు లేకుండా విస్పష్టంగా ప్రకటించాయి కూడా. శ్రీకృష్ణ కమిటీ 10 మాసాల పాటు 20 కోట్లకు పైగా ప్రజా ధనాన్ని ఖర్చు పెట్టి విడుదల చేసిన దాదాపు 600 పేజీల నివేదిక తెలంగాణా ప్రజల ఆకాంక్షలకు అద్దం పట్టలేదు. పైగా సీమాంధ్ర నేతల సమైక్యాంధ్ర భావనలనే అడుగడుగునా వ్యక్తం చేసింది. దండలో దారంలాగా సమైక్యాంధ్ర భావాలనే గాకుండా ఇపుడున్నట్లుగానే రాష్ట్రాన్ని యాథావిధిగా వుంచాలనే సూచించింది. కొండను తవ్వి ఎలుకను కూడా పట్టక పోయిన చందంగా ఈ రిపోర్టు వుంది. ఈ కమిటీ అనవసరమైన, అభ్యంతరకరమైన, అవాస్తవమైన అనేక అంశాలను, ప్రతిపాదనలను ముందుకు తెచ్చింది. తెలంగాణా ప్రజల ఆకాంక్షలు, పోరాటాలు, త్యాగాలు, చరిత్రను పరిగణలోకి

తీసుకోలేదు. ఊసరవెళ్ళిలాగా రంగులు మార్చే కొన్ని రాజకీయ పార్టీల నేతల అభిప్రాయాలకే ప్రాధాన్యతనిచ్చింది. అన్నింటిని మించి స్వార్థపూరిత, దోపిడి వర్గ స్వభావాన్ని నిలువెల్లా సంతరించుకున్న పాలకుల అభిప్రాయాన్నే ఈ కమిటీ ప్రతిపాదించింది. కేంద్ర సర్కార్ తన అభిప్రాయాన్ని ఈ కమిటీ రూపంలో వెల్లడించినట్లుగా పలువురు రాజకీయ విశ్లేషకులు ఇప్పటికే స్పష్టం చేశారు.

ఏడాదిపాటు ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాల్లో పర్యటించి 'అధ్యయనం' చేసిన ఈ రిపోర్టులో మొత్తం 9 చాప్టర్లు వున్నాయి.

1) ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి - చారిత్రక పూర్వరంగం. 2 ) ప్రాంతీయ ఆర్థికత - సమతుల్య పరిశీలన 3) వైద్యం, ఆరోగ్యం 4) నీటి పారుదల, విద్యుత్ ఉత్పత్తి 5) ప్రభుత్వ రంగంలో ఉపాధి అవకాశాలు 6) హైదరాబాద్ మెట్రో అంశాలు 7) సామాజిక, సాంస్కృతిక అంశాలు 8) శాంతి భద్రతలు - అంతరంగిక భద్రత 9) ముందుకు పోయే మార్గం.

పై అంశాలపై అధ్యయనం చేసిన ఈ కమిటీ చేసిన నిర్ధారణలు అనేకం వివాదాస్పదంగానూ, పాక్షికంగాను వున్నాయి. ఈ రిపోర్టులో మొత్తంగా సమైక్యాంధ్ర భావనలను గుప్పించినప్పటికీ, తెలంగాణా పట్ల జరిగిన వివక్షత, అన్యాయం, నిర్లక్ష్యం పట్ల కూడా కొన్ని వాస్తవాలున్నాయి. ఈ కమిటీ వెలువరించిన అంకెలు, విశ్లేషణలపై అనేక భిన్నాభిప్రాయాలున్నాయి. విమర్శలూ వెలువడ్డాయి. చారిత్రక వాస్తవాలను ఈ కమిటీ కావాలనే విస్మరించిందని విద్యుత్ రంగ నిపుణులు ఆధారాలతో సైతం ఇప్పటికే బహిర్గతపరిచారు. మొత్తం ఈ కమిటీ స్వతహాగా చేసిన సర్వేగాకుండా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వివిధ సందర్భాల్లో వెల్లడించిన సమాచారాన్నే వల్లే వేసింది. ఈ అంకెలు, సమాచారం వాస్తవాలను ప్రతిబింబించలేవని తెలంగాణా ఉద్యమ సంస్థలు, ఉద్యమకారులు ఏనాటి నుండో ప్రకటిస్తూ వస్తున్నారు. 8వ చాప్టరును రహస్యంగా వుంచడంలో ఈ కమిటీకి దురుద్దేశ్యాలున్నట్లుగా తనకు తానే బహిర్గత పరుచుకొన్నది.

శ్రీకృష్ణ కమిటీ తన రిపోర్టును తొమ్మిది అధ్యాయాలుగా విశ్లేశించి ఆరు పరిష్కార మార్గాలను సూచించింది. మొదటి నాలుగింటిని కమిటీయే ఆచరణ యోగ్యమైనవి కావని చెప్పింది. ఇక ఆఖరి 5,6 అంశాలనే మొదటి, రెండవ ఉత్తమ పరిష్కార మార్గాలుగా సూచించింది. 5వ ప్రతిపాదన ప్రకారం సీమాంధ్ర, తెలంగాణ ప్రాంతాలను రెండు రాష్ట్రాలుగా విభజించడం, హైదరాబాద్‌ను తెలంగాణాకు రాజధానిగా వుంచి, సీమాంధ్రకు నూతన రాజధానిని ఏర్పాటు చేయడం, అఖరుదైన 6వ ప్రతిపాదన రాష్ట్రాన్ని ఇప్పటి లాగా సమైక్యంగానే వుంచుతూ, తెలంగాణా ప్రాంతంలో సామాజిక, ఆర్థిక అభివృద్ధికీ, రాజకీయ సాధికారతకూ నిర్దిష్టమైన రాజ్యాంగబద్ధ చర్యలు చేపట్టాలన్నది. దీని కోసం తెలంగాణా ప్రాంతీయ మండలులను ఏర్పాటు చేయాలన్నది.

మొత్తం శ్రీకృష్ణ కమిటీలోని 5,6 అంశాలే కీలకమైనవిగా భావించినప్పుడు 5వ అంశం మాత్రమే తెలంగాణా ప్రజల ఆకాంక్షలకు అద్దం పట్టేదిగా వున్నది. అయితే ఇక్కడ కూడా మళ్ళీ షరతులు విధించారు. ఈ 5వ ప్రతిపాదనకు సైతం అన్ని ప్రాంతాల ప్రజల ఆమోదం వుండాలనే షరతు పెట్టింది. అన్ని ప్రాంతాల ప్రజల ఆమోదం అనడంలోనే మోసం, కుట్ర దాగి వున్నది. భౌగోళికంగా రాష్ట్రంలో సీమాంధ్ర సగానికి పైగా వున్నప్పుడు అ ప్రాంతాల ఆమోదం వుండాలనడం అర్థరహితమైనదే గాకుండా ఆచరణలో సాధ్యం కానిదిగా కూడా వుంది. ఈ రూపంలో ఆమోదం రావడమనేది జరగని విషయం.

ఇక ఆఖరిది, అన్నిటికంటే ఉత్తమమైనదిగా శ్రీకృష్ణ కమిటీ సూచించిన 6వ ప్రతిపాదన ఎంత మాత్రం సాధ్యం కానిది. గత 50 సంవత్సరాలకు పైగా సమైక్య రాష్ట్రంలో తెలంగాణా ప్రాంతానికున్న ఒప్పందాలు, రక్షణలు, హామీలు ఏవీ నెరవేరని

# నిరాకరణ.. నిరసన







నేపథ్యంలోనే తెలంగాణా ప్రజలు తమకు ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు మినహా ఇంకేమి అవసరం లేదనే కృతనిశ్చయానికొచ్చారు. దాని కోసం 1969కి ముందూ, ఆ తర్వాత కాలం నుండి నేటి దాకా తెగించి పోరాడుతున్నారు. ఒక్క మాటలో చెప్పిలంటే ఈ ఆరవ ప్రతిపాదన ఫిలమెంట్‌లేని బల్బులాంటిది. ఫిలమెంట్ లేకుండా ఎన్నిసార్లు స్విచ్‌ను ఆన్ చేసినా బల్బు వెలగనట్టే ఎన్ని ఆర్థిక మండలాలు వేసినా అదంతా వ్యర్థ ప్రయత్నంగానే మిగలక తప్పదని చరిత్ర ఇప్పటికే నిరూపించింది.

సమైక్యాంధ్ర రాష్ట్రంలో నీళ్ళు, నిధులు, ఉద్యోగాలు, ప్రమోషన్లు వనరులు ఏవీ న్యాయబద్ధంగా, ధర్మబద్ధంగా తెలంగాణా ప్రజలకు అందలేదు. వివక్షత, దోపిడీ, అన్యాయం నుండే తెలంగాణా రాష్ట్రం కావాలనే డిమాండ్ తలెత్తిన వాస్తవాన్ని శ్రీకృష్ణ కమిటీ కావాలనే మరుగుపరచి మళ్ళీ సమైక్యాంధ్రే పరిష్కారంగా సూచిస్తున్నది. ఇంతకంటే దగా, మోసం, వంచన మరోకటి వుండదు గాక వుండదని గుర్తించాలి. ఐదు దశాబ్దాలుగా వికటించిన ఈ ప్రయోగాన్ని రంగ మెక్కించ పూనుకోవడం దుస్సాహసంలాంటిదే. అన్నింటికి మించి షరతులతో 1956 నవంబర్ 1న ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అడుగడుగునా తెలంగాణా ప్రాంతం దగా పడినందునే, మోసపోయినందునే నేటి మహోద్యమం ముందుకొచ్చిందనే చారిత్రక వాస్తవాన్ని కావాలనే శ్రీకృష్ణ కమిటీ తొక్కిపట్టింది. మరుగుపర్చ ప్రయత్నించింది. బొందపెట్టజూస్తుంది.

**డిసెంబర్ 9 ప్రకటనకు కట్టుబడి పార్లమెంట్‌లో బిల్లు పెట్టాలి:**

శ్రీకృష్ణ కమిటీలోగాని, దాని సిఫారసులతోగానీ పనిలేకుండా కేంద్ర ప్రభుత్వం 2009 డిసెంబర్ 9న తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమవుతుందని చేసిన ప్రకటనకు కట్టుబడి పార్లమెంట్‌లో బిల్లు పెట్టాలి. ఇది మినహా మరే ప్రతిపాదనగానీ ప్రత్యామ్నాయం గానీ లేదని కేంద్ర ప్రభుత్వానికి తెలియజేయాలి.

ఇచ్చేది మేమే, తెచ్చేది మేమే అంటూ గత సంవత్సర కాలం పాటు బడాయి పోయిన కాంగ్రెస్ నేతలు, దాని ప్రజా ప్రతినిధులు శ్రీకృష్ణ కమిటీ రిపోర్టు వచ్చింతర్వాత కూడా అదే పల్లవి మోగిస్తున్నారు. తెలంగాణా ప్రజల్ని ఇంకా ఇంకా మోసం చేయడానికి రకరకాల కుటిక ఎత్తుగడలకు కాంగ్రెస్ పార్టీ దాని ఆధ్వర్యంలోని కేంద్ర యూపిఏ సర్కార్ పూనుకుంటున్నది. "కాంగ్రెస్ ఇస్తే మేము కాదంటామా" అంటూ కాంగ్రెస్‌కు తోడు దొంగగా వ్యవహరిస్తున్న తెలుగుదేశమూ తెలంగాణా రాష్ట్ర సాధనకు మోకాలడ్డుతున్నది. ఏకాభిప్రాయం పేరిట కాంగ్రెస్ గానీ, రెండు కళ్ల సిద్ధాంతం పేరుతో చంద్రబాబు తెలుగుదేశంగానీ, సామాజిక తెలంగాణా నుండి సమైక్యాంధ్రకు మళ్ళీన చిరంజీవి మెగా మోసాన్ని తెలంగాణా ప్రజలేవరూ గురిగాకుండా అప్రమత్తంగా, జాగరూకంగా వుండేలా ప్రజలను చైతన్యవంతం చేయాలి. అలా ఐక్యంగా నిలబెట్టేలా తెలంగాణా ఉద్యమ నాయకత్వం బాధ్యతాయుతంగా వ్యవహరించాల్సి వుంది. మహోద్రుతంగా కొనసాగుతున్న ఈ ఉద్యమాన్ని రకరకాల సాకులు చూపి చీల్చి పబ్బం గడుపుకోజూసే సీమాంధ్రకు చెందిన స్వార్థపరుల నుండి, పదవులు తప్ప మరేం పట్టని ఇంటి దొంగల నుండి కాపాడుకోవాల్సిన బాధ్యత పురోగామి శక్తులపైనే వున్నది.

లాఠీ, తుటాల ద్వారా, పారా మిలటరీల బలగాల ద్వారా ఉద్యమాన్ని అణచి వేయజూస్తే రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల నిరంకుశ, పాశవిక విధానాల నుండి ఉద్యమాన్ని కాపాడుకోవాన్ని బాధ్యత మరోసారి నేడు ముందుకోచ్చింది. చేతికి వచ్చిందనుకున్న తెలంగాణాను చేజార్చడమేగాకుండా సంవత్సరం తర్వాత సైతం మొండి చేయి చూపుతున్న కేంద్ర ప్రభుత్వమే ప్రధాన టార్గెట్‌గా ఉద్యమం కొనసాగాల్సిన అవసరముంది. కేంద్రం మెడలు వంచే రీతిలో తెలంగాణా ప్రజానీకం సహాయ నిరాకరణల్లాంటి ఉన్నత పోరాట రూపాలను చైతన్యయుతంగా, సంఘటితంగా కొనసాగించాల్సి వున్నది. ఈ విశాల ప్రజా ఉద్యమానికి అటు కోస్తాంధ్ర, రాయల సీమల నుండే గాకుండా దేశ, విదేశాల నుండి సంఘీభావాన్ని కూడగట్టుకునేలా ఉద్యమ శక్తులు ప్రత్యేకించి ఉద్యమ నాయక్తం బాధ్యతాయుతంగా వ్యవహరించాల్సి వున్దఇ. తెలంగాణా వచ్చే దాకా ఆగకుండా పోరాడేలా, ఉద్యమించేలా అన్ని వర్గాల ప్రజానీకాన్ని సమాయత్తం చేయాలి. కేంద్ర ప్రభుత్వానికి, దానికి అండగా నిలబడుతున్న రాష్ట్ర ప్రభుత్వాన్ని, రాష్ట్ర కాంగ్రెస్ ఎంపీలనూ, ఎమ్మెల్యేలను నిలదీయాలి. అడ్డుకోవాలి. ఇలా ఎక్కడికక్కడ నిరంతర వత్తిడిని మరింత తీవ్రతరం చేయాలి. తెలంగాణా తేకుంటే తెలంగాణాలో తిరగలేరనే విధంగా ఎక్కడిక్కడ నిలువరించాలి.

సహాయ నిరాకరణతో ప్రభుత్వాన్ని స్తంభింప చేయడం ద్వారానే, వినూత్న పోరాట రూపాల ద్వారానే కేంద్ర ప్రభుత్వాన్ని మెడలు వంచి తెలంగాణా సాధించుకోవాలి. ఇది ఆఖరి పోరాటమనీ, ఇపుడు కాకపోతే తెలంగాణా మరెప్పుడూ రాదనే నిరాశా నిస్పృహలకు లోనయి ఆత్మహత్యలకు యువకులు, విద్యార్థులు బలిగాకుండా చూడాలి. ఈ బాధ్యత కూడా ప్రధానంగా ఉద్యమ నాయకత్వానిదే. ఇది ఆఖరి పోరాటం కాదని, అగని పోరాటమేనని నిర్ద్వంద్వంగా ప్రకటించాలి. నాలుగు కోట్ల తెలంగాణా ప్రజల ప్రజాస్వామ్య ఆకాంక్షను నెరవేర్చకుండా ఏకాభిప్రాయం పేరిట, అఖిలపక్షం పేరిట కపట నాటకాలాడే కాంగ్రెస్‌కు పుట్టగతులు లేకుండా చేయాలి. ఒకవైపు నిర్బంధం, మరోవైపు మోసపు ప్రయత్నాలతో తెలంగాణా రాష్ట్ర ఏర్పాటును అడ్డుకుంటే కాంగ్రెస్ పార్టీకి ఈ ప్రాంతంలో పుట్టగతుల్లేకుండా చేసే వైపుగా ఉద్యమాన్ని ఎదిగించుకోవాల్సిన బాధ్యత అందరి మీదా వుంది.

*–వ్యాసకర్త సిపిఐ (ఎం.ఎల్)*
*న్యూడెమొక్రసీ రాష్ట్ర కమిటీ సభ్యులు*

# తెలుగు న్యూస్ చానల్స్ ను అడ్డుకున్నదెవరు?



*-తోట భావనారాయణ*

మొదటి సారిగా తెలుగు న్యూస్ చానల్స్ అన్నీ ఒక్కటయ్యాయి. ఒకరిమీద ఒకరు దుమ్మెత్తిపోసుకున్న సందర్భాలను మరచిపోయి చేయిచేయి కలిపి మీడియా స్వేచ్ఛ కోసం చానల్స్ యజమానులు పోరాటబాటన సాగుతామని ప్రతినబూనారు. రేటింగ్ పోటీని, ఒకరినొకరు ఉతికి ఆరేసుకునే కార్యక్రమాన్నీ పక్కనబెట్టి ప్రభుత్వాన్ని ఉమ్మడి శత్రువుగా ప్రకటించటానికి పోటీ పడ్డారు. చర్చావేదికల్లో శ్రీకృష్ణ కమిటీ నివేదికను చీల్చి చెండాడదామని అనుకుంటే ప్రభుత్వమే సైందవుడిలా అడ్డుపడిందని ప్రజలకు చాటిచెప్పటానికి నానా ప్రయాసపడ్డారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పోలీసుల దౌర్జన్యాలను చూపించకుండా హైదరాబాదు నగర పోలీసు కమిషనర్ ఆదేశాలిచ్చి తమ స్వేచ్ఛను కాలరాశారంటూ కారాలూ మిరియాలూ నూరారు. కానీ ఇది గడసరితనమే తప్ప, పైకి కనిపించినంత ధర్మాగ్రహం కానేకాదని జాగ్రత్తగా గమనిస్తే అర్థమవుతుంది. ఈ మొత్తం వ్యవహారాన్ని అర్థం చేసుకోవాలంటే ప్రధానంగా రెండు అంశాలను ముందుగా తెలుసుకోవాలి. ఒకటి కేబుల్ టీవీ చట్టం. రెండోది వార్తా ప్రసారకుల సంఘం (న్యూస్ బ్రాడ్ కాస్టర్స్ అసోసియేషన్). ముందుగా కేబుల్ టీవీ చట్టం గురించి మాట్లాడదాం. ఈ చట్టం 1995 నాటిది. ఇందులో చాలా లొసుగులున్నాయి. భవిష్యత్తులో ఎలాంటి పరిస్థితులకు అవకాశం ఉంటుందో కనీస స్థాయిలో కూడా అది ఆలోచించలేకపోయింది. అందుకే ఆ తరువాత తలెత్తిన అనేక ప్రశ్నలకు అది సమాధానం చెప్పలేకపోయింది. అయినా సరే ఆ చట్టాన్నే అందరూ పాటించాలి. గనుక తప్పదు. అంటే ఇది పదహారేళ్ళుగా అమలులో ఉన్నదే. ఈ రోజు కొత్తగా అమలు చేయటమనే ప్రశ్నే తలెత్తదు గనుక తెలుగు న్యూస్ చానల్స్ సీఈఓలు సరికొత్తగా మేలుకొని జూలు విదిల్చి ఆగ్రవేశాలు వెళ్ళగక్కాల్సిన అవసరమే లేదు. ప్రజలను రెచ్చగొట్టే విధమైన ప్రసారాలు చేయకూడదని చెప్పటం చాలా మామూలు విషయమే. చట్టం అదే చెప్పింది. శ్రీకృష్ణ కమిటీ నియామకానికి ముందు, నియామకం తరువాత, నివేదిక ఇచ్చాక కూడా అదే చట్టం ఉంది. ఇప్పుడు కొత్తగా ఉలిక్కిపడాల్సిన, గగ్గోలుపెట్టాల్సిన అవసరమే లేదు. కానీ చానల్స్ ఒక్కసారిగి శ్రీకృష్ణ కమిటీ నివేదిక అనంతర ఘటనల ప్రసారాలకు సంబంధించి కేబుల్ టీవీ చట్టంలో చెప్పారేమో అని అర్థం వచ్చేలా ఇప్పుడు రాద్ధాంతం చెయ్యాల్సిన అవసరమేమైనా ఉందా? లేదు. కానీ ప్రభుత్వం ఆదేశాలిచ్చిందంటూ నమ్మించే ప్రయత్నం చేశారు.

ఇక రెండోది...వార్తా ప్రసారకుల సంఘం (ఎన్‌బిఏ) ప్రభుత్వం ఆంక్షలు విధించకుండా ఉండాలంటే స్వీయనియంత్రణ మేలని అందరూ చెబుతున్న సమయంలో న్యూస్ చానల్స్ ఏర్పాటుచేసుకున్న సంస్థ ఇది. న్యూస్ చానల్స్ పాటించాల్సిన నియమాలు రూపొందిచటంతోపాటు కొన్ని ప్రత్యేక సందర్భాలలో ప్రత్యేక సూచనలు కూడా చేయటం దీని పని. ఆ విధంగా ప్రభుత్వ జోక్యా నివారించగలుగుతున్నామని సంస్థ భావిస్తోంది. ముంబై తీవ్రవాదుల దాడి సందర్భంగా మీడియా వ్యవహరించిన తీ పరోక్షంగా తీవ్రవాదులకు సహకరించిందని విమర్శలొచ్చా ముందస్తుగా కొన్ని సూచనలు చేయటం మొదలైంది. ఆయో తీర్పు సమయంలో మార్గదర్శకాలిచ్చినట్టే శ్రీకృష్ణ కమిటీ నివే సమయంలో కూడా సభ్యత్వం తీసుకున్న చానల్స్‌కు కొన్ని సూచన చేసింది. ఇక్కడ గమనించాల్సిన విషయమేమిటంటే ఈ సూచన అందేది. వర్తించేది సభ్యులకు మాత్రమే అంటే, తెలుగు లో ఉ 15 న్యూస్ చానల్స్ కు గాను సభ్యత్వం తీసుకున్న ఈటీవీ టీవీ9,సాక్షి,హెచ్‌ఎంటీవీ, జీ24 గంటలు, జెమినీ న్యూస్ చాన మాత్రమే ఆ సూచనలు అందుకున్నాయి. ఈ సూచనలు ఎన్‌ వారి వెబ్‌సైట్‌లో కూడా ఉంటాయి. కాబట్టి ఒక కాపీ డౌన్‌ చేసి మన కమీషనర్ ఏకే ఖాన్ అన్ని న్యూస్ చానల్స్‌కు పంపు మీ సంఘం చేస్తున్న సూచనలైనా పాటించండంటూ కోరారు. ఒక సూచన మాత్రమే ఇందులో ఆదేశం ఎక్కడాలేదు. కానీ పో కమీషనర్ చెప్పటం మన సీఈఓలకు ఎక్కడలేని ఆగ్రహ తెప్పించింది. అభ్యంతరాలుంటే సూచనలిచ్చిన ఎన్‌బి నిలదీయకుండా పోలీసులను సాకుగా చూపే ప్రయత్నమెందు అవును మరి... తోటికోడలు నవ్వితే తట్టుకోవటం కష్టమే క

తెలంగాణకు అనుకూలంగా ఉద్యమిస్తున్న ఉస్మాని విద్యార్థుల ఆవేదనను టీవీలో చూపాలనకున్నా, శ్రీకృష్ణ క నివేదికమీద చర్చోపచర్చలతో ప్రజలకు వాస్తవా వివరించాలనుకున్నా ఏకే ఖాన్ అడ్డుపడ్డారని చెప్పుకోవట ఒక సాకు దొరికిందని సంతోషపడిన చానల్స్ యాజమానుల ఆగ్రహం నటించారని స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. ఈ మరింత ఉలుకుపాటు కలిగించవచ్చు గాని మొదటి నుంచి విశ్లే అసలు విషయం అర్థమవుతుంది. ఎన్‌బిఏ ఇచ్చినవి ఆదేశా సూచనలా? కచ్చితంగా అవి సూచనలు మాత్రమే. అవి న పక్షంలో సభ్యులు తమ అభిప్రాయాలను సంఘానికి తెలుప అవకాశం లేదా? ఇక్కడి ప్రత్యేక పరిస్థితులను వివరించి సంఘ ఒప్పించేందుకు సభ్యత్వమున్న ఆ ఆరు చానల్స్ ప్రయత్నించా ఎన్‌బిఏ ఆదేశాలు సభ్యులందరికీ అనివార్యంగా శిరోధార్య భావించిన పక్షంలో సభ్యులు కాని 9 చానల్స్ మాటేమిటి?

ఎన్‌బీఏ సూచనలు పాటించాల్సిన అగత్యం అసలే లేదు కదా? తెలంగాణ రాష్ట్ర సమితి ఆధ్వర్యంలో నడుస్తున్న రాజ్ న్యూస్ కూడా ఈ ఉచ్చులో ఎలా చిక్కుకుంది? ఎందుకు భయపడింది? అసలు లైసెన్స్ ఉన్న రాజ్ న్యూస్ నుంచి ఒత్తిడి ఉందా? ప్రత్యక్ష ప్రసారాల కోసం ఉపయోగించే ఓబివ్యాన్ / డిఎస్ఎన్‌జి వాహనాల వినియోగం విషయంలో కొన్ని నిబంధనలున్న మాట నిజం. ప్రత్యేక సందర్భాల్లో పోలీసులు కొన్ని చోట్లకు అనుమతించకపోవచ్చు. నిబంధనలు అతిక్రమిస్తే వాటి లైసెన్సులు రద్దు చేయవచ్చు. కానీ ఈ కారణంగా ఇప్పటి వరకు దేశంలో ఏ ఒక్క చానల్ కూడా ఎస్‌న్‌జి లైసెన్స్ రద్దయిన దాఖలాలు లేవు. పైగా అలాంటి " ప్రత్యేక సందర్భాఆల్లో" ప్రత్యక్షప్రసారాలు కుదరకపోయినా రికార్డు చేసి ప్రసారం చేయటానికి ఎలాంటి అభ్యంతరాలు లేవు. ఈ హక్కులను నిజంగా ఎవరైనా అడ్డుకొని ఉంటే చానల్స్ న్యాయపోరాటానికి సిద్ధం కాలేదెందుకని?

మళ్ళీ ఖాన్ గారి కొరడా దగ్గరికొద్దాం. చానల్స్ ప్రసారాల విషయంలో ప్రభుత్వ జోక్యం లేనేలేదని మొరపెట్టుకున్నా ఆయన మాటలు వినపడనట్టు నటించారు. పైగా, ఎవరైనా రెచ్చగొట్టే వార్తలు ప్రసారం చేయవద్దని సూచించినంత మాత్రాన నిజాలు చూపవద్దని అర్థం చేసుకుంటే ఎలా? ప్రజలకు సమాచారం చేరవేయటం మీడియా పని, ఆంక్షలు ఉన్నా బేఖాతరుచేసి నిజాలు నిర్భయంగా చాటిచెబుతామని పదే పదే చెప్పుకునే మీడియా ఇలా కుంటి సాకులు చూపడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? కమీషనర్ ఇచ్చింది ఎన్‌బీఏ సూచనలే తప్ప ప్రభుత్వాదేశాలు కాదని ఈ సీఈఓలకు తెలియదా? ఎవరి ఉచ్చులో ఎవరు పడ్డారు? ఉస్మానియా యూనివర్సిటీలో ఏం జరుగుతున్నదో చెప్పాల్సిన బాధ్యత నుంచి వైదొలగేలా చేసిన ఈ వ్యవహారంలో ఎలాంటి కుట్రా లేదంటే నమ్మగలమా? వాస్తవాలకు అద్దం పట్టాల్సిన మీడియా ఇలా ముఖం చాటేస్తే విశ్వసనీయత ప్రశ్నార్థకం కాదా?

*(వ్యాసకర్త సీనియర్ జర్నలిస్ట్)*

లేఖ....

## క్యాంపస్ వాయిస్ ను ఆదరించండి

**విద్యార్థులు, మేధావులు, ప్రజాస్వామ్యవాదులారా!**

చారిత్రాత్మక ఉస్మానియా విశ్వవిద్యాలయం అనేక పోరాటాలకు,ఉద్యమాలకు పుట్టినిల్లు. అది వందేమాతరం ఉద్యమం కావచ్చు...కాదంటే భూమి,భుక్తి, విముక్తి పోరాటంగా మారి నిజాం రాచరికాన్ని నిర్మూలించిన తెలంగాణ రైతాంగ సాయుధపోరాటం కావచ్చు....అన్నింటి కన్న మిన్నగా ప్రపంచ ప్రజా ఉద్యమాలలో చిరస్థాయిగా నిలిచిపోయే విధంగా తమ నులివెచ్చని నెత్తుటి ధారల తర్పాన్ని కావించి **369** మంది విద్యార్థి అమరులు నడిపిన తొలిదశ **1969** ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఐనా, కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాల మెడలు వంచి ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమౌతుంది అంటూ ప్రకటింపజేసుకున్న నేటి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం కావచ్చు......రాడికల్ కమ్యూనిజం నుంచి దళిత,బహుజన ఉద్యమాల వరకు కాదేది అనర్హం అంటూ సిద్ధాంతాల నిత్య సంఘర్షణతో, అనునిత్యం మేధోమథనంతో నిరంతర జ్వలిత ఉద్యమాలతో విలసిల్లుతున్నది ఉస్మానియా విశ్వవిద్యాలయం. అటువంటి విశ్వవిద్యాలయంలో సామాజిక స్పృహ, ప్రజాస్వామిక భావాలు కలిగిన పరిశోధక విద్యార్థులుగా మేము ఆ ఉద్యమ వారసత్వాన్ని కొనసాగిస్తూ మరో ముందడుగు వేస్తూ సామాజిక, రాజకీయ, ఆర్థిక మాస పత్రికను ప్రచురిస్తున్నాము. ఈ పత్రిక ఏ రాజకీయ పార్టీకి కొమ్ముకాయకుండా నిష్పక్షపాతంగా వ్యవహరిస్తూ, విశ్లేషనాత్మకమైన వ్యాసాలను మీముందుకు తీసుకువస్తుంది. ఇప్పటికే తెలుగులో అనేక మాసపత్రికలు ఉన్నప్పటికీ జాతీయంగా, అంతర్జాతీయంగా వస్తున్న మార్పులను, సామాజిక, రాజకీయ, అస్థిత్వ ఉద్యమాలను నిశితంగా పరిశీలిస్తూ తెలుగు పాఠకులకు అందిస్తున్న సీరియస్ పత్రికలు చాలా తక్కువగానే ఉన్నాయని చెప్పవచ్చు, ఆలోటును పూడ్చేందుకు, పరిశోధక విద్యార్థులుగా మా ఈ చిన్ని ప్రయత్నం. క్యాంపస్ వాయిస్ ప్రారంభించి కొన్ని నెలలు మాత్రమే అయినప్పటికి విద్యార్థి, మేధావుల, ప్రజాస్వామిక వాదుల మన్ననలు పొంది ముందుకు దూసుకు వెళ్తుంది.నేడు పత్రికలు తీసుకురావడం ఎంతో శ్రమ, వ్యయ ప్రయాసలతో కూడుకున్నది అయినప్పటికి సామాజిక పరిశోధకులుగా ప్రజలను చైతన్యవంతులను చేయడం మా బాధ్యతగా గుర్తించి, ఈ మాసపత్రికను తీసుకువస్తున్నాము. మేము చేస్తున్న ఈ ప్రయత్నానికి మీనుండి సలహాలు, సూచనలు అందిస్తూ ఒక నిర్మాణాత్మక చర్చకు తోడ్పడండి. ఈ పత్రిక మీది, మాది, మనందరిది. ఈ పత్రికను అందరితో చదివించండి. చందాదారులుగా చేర్పించండి.

# చరిత్రలో అంతర్జాతీయ మహిళా దినోత్సవం

-అలెగ్జాండర్ కొల్లంత

*(అలెగ్జాండర్ కొల్లంతాయ్ (1872-1952) రష్యా విప్లవోద్యమంలో ప్రముఖ నాయకురాలు. ధనిక కుటుంబంలో పుట్టిన ఆమె కమ్యూనిస్టు ఉద్యమంలో చేరి రాష్యా విప్లవంలో చురుకుగా పాల్గోన్నారు. అనేక దేశాల్లో ప్రవాస జీవితం గడిపారు. మంచి వక్త, రచయిత అయిన కొల్లంతాయ్ రష్యాలో మహిళలను సమీకరించడంలోనూ, అంతర్జాతీయ మహిళా దినోత్సవ ఆవిర్భావంలోనూ కీలక పాత్ర నిర్వహించారు. తొలినాటి మహిళా ఉద్యమం, దాని విప్లవ లక్ష్యాలను వివరిస్తూ 1920లో రాసిన వ్యాసం ఇది)*

'మహిళా దినోత్సవం' అననీయండి, 'శ్రామిక మహిళా దినోత్సవం' అననీయండి ఈ రోజు (మార్చి 8) అంతర్జాతీయ సంఘీభావ దినోత్సవం. శ్రామిక మహిళా ఉద్యమం తన బలాన్ని, నిర్మాణాన్ని సమీక్షించు కోవాల్సిన రోజు. అయితే ఇది మహిళలకు మాత్రమే ప్రత్యేకించిన రోజు కాదు. మార్చి 8 అనేది కార్మికులకు, రైతాంగానికి, కార్మికవర్గానికి యావత్ ప్రపంచ కార్మిక వర్గానికి చారిత్రాత్మకమైన మరుపురాని రోజు. 1917లో ఈ రోజునే రష్యాలో మహత్తర ఫిబ్రవరి విప్లవం బద్దలయింది. పీటర్స్‌బర్గ్‌లో శ్రామిక మహిళలు ఈ విప్లవానికి నాంది పలికారు. జారు చక్రవర్తి, అతని సైనికులకు వ్యతిరేకంగా జెండా ఎత్తారు. అందుకే శ్రామిక మహిళలకు ఇది రెండు పండుగలు కలిసివచ్చిన సందర్భం. మార్చి 8వ తేదీ శ్రామిక వర్గానికి సార్వత్రిక సెలవు దినం అయినా మనం దీన్ని మహిళా దినోత్సవం అని ఎందుకు పిలుచుకుంటున్నాం. ప్రత్యేకించి శ్రామిక, రైతాంగ మహిళా సమావేశాలు నిర్వహించడం మీదే ఎందుకు దృష్టి పెడుతున్నాం. దీనివల్ల మనం కార్మికవర్గం ఐక్యతను గానీ, అంతర్జాతీయ సంఘీభావాన్ని గాని దెబ్బతీస్తున్నామా? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవాలంటే మనం ఒకసారి చరిత్రను తరచి చూసుకొవాలి. ఏ లక్ష్యం కోసం మహిళా దినోత్సవాన్ని జరుపుకుంటున్నామో గుర్తు చేసుకోవాలి.

**ఎందుకు, ఎలా..?**

పదేళ్ల క్రితం నుండి (1910) మహిళా సమానత్వం గురించి, మగవాళ్ళతోపాటుగా మహిళలకు కూడా రాజకీయ పాలనాధికారం గురించి తీవ్రమైన చర్చ సాగుతోంది. పెట్టుబడి దారీ దేశాలన్నింటా కార్మిక వర్గం శ్రామిక మహిళల హక్కుల గురించి పోరాటాలు నిర్వహిస్తూ ఉన్నది. కానీ బూర్జువా వర్గం శ్రామిక మహిళలకు హక్కులు ఇవ్వనికారిస్తోంది. కార్మిక వర్గం ఓటింగ్ హక్కును విస్తృతం చేయడం ద్వారా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో కార్మికవర్గం బలపడడానికి, తమ ఆధిపత్యం వదులుకోవడానికి బూర్జువా వర్గం సిద్ధంగా లేదు. అందుకే బూర్జువా వర్గం ప్రతిదేశంలోను మహిళలకు హక్కులు కల్పించే బిల్లులకు చట్టపరమైన ఆమోదం లభించకుండా అటంకాలు కల్పిస్తూనే ఉన్నది.

అమెరికాలో సోషలిస్టులు మహిళలకు ఓటు హక్కు
పట్టుపట్టి పోరాటాలు నిర్వహించారు. 1909 ఫిబ్రవరి 28న శ్ర
మహిళలకు రాజకీయ హక్కులు కల్పించాలనే డిమాం
అమెరికా అంతటా ప్రదర్శనలు, మీటింగులు జరిగాయి.
రకంగా చెప్పుకోవాలంటే ఇదీ 'మహిళా దినోత్సవమే' మ
దినోత్సవ నిర్వహణకు సంబంధించి చొరవ చేసింది అమె
మహిళా కార్మిక వర్గమే అని చెప్పుకోవచ్చు.

1910లో జరిగిన శ్రామిక మహిళల రెండవ అంతర్జా
సదస్సులో క్లారాజెట్కిన్ అంతర్జాతీయ శ్రామిక మహిళా దినోత్స
జరుపుకోవాల్సిన అవసరం గురించి లేవనెత్తింది. మహి
ఓటింగ్ హక్కు సాధించుకోవడం ద్వారా మహిళా ఐక్య
పెంపొందించుకుని సోషలిజం సాధనను బలోపేతం చేయ
నినాదంతో ప్రతి దేశంలో ప్రతి ఏడాదీ ఒకే రోజున 'మ
దినోత్సవం' నిర్వహించుకోవాలని సదస్సు పిలుపునిచ్చింది.

ఈ కాలంలో మహిళలకు వయోజన ఓటు హక్కు కల్పిం
ద్వారా పార్లమెంటును మరింత ప్రజాస్వామికరించాలనే అ
కీలక ప్రాధాన్యతను సంతరించుకుంది. మొదటి ప్ర
యుద్ధానికంటే ముందుకాలం నుంచే ఒక్క రష్యాలో మినహా
బూర్జువా దేశాల్లోనూ కార్మికులకు ఓటు హక్కు ఉంది. కే
మహిళలు, మతిస్తిమితం లేని వాళ్లను మాత్రమే ఈ హక్కు న
మినహాయించారు. అదే సందర్భంలో పెట్టుబడిదారీ వి
ఎదుర్కొన్న కటువైన వాస్తవ పరిస్థితులు ఏమిటంటే దేశ
వ్యవస్థలో మహిళల భాగస్వామ్య అవసరాలు అంతకం
పెరుగుతూ వచ్చాయి. ఫ్యాక్టరీలలో, వర్క్‌షాపులలో, ఆఫీసు
పని చేయడానికి మహిళల అవసరం ఏటికేటికి పెరుగ
వచ్చింది. పురుషులతో సమానంగా మహిళలు పనిచేసి దేశ స
పోగు చేయడంలో తమవంతు కృషి చేశారు. అయినా మహి
ఓటు హక్కు లేకుండా పోయింది. అయితే యుద్ధానికి మ
సంవత్సరాల్లో ఆహార ఉత్పత్తుల ధరలు విపరీతంగా పెరిగి
ఇంటిపట్టున ప్రశాంతమైన జీవితం గడిపే గృహిణీమణులు క

ఇందుకు గల రాజకీయ కారణాలను అర్థం చేసుకుని బూర్జువా ఆర్థిక వ్యవస్థ దోపిడిని ప్రశ్నించే స్థాయికి ఎదిగారు. గృహిణీమణుల తిరుగుబాట్లు, రోడ్లమీదకొచ్చి ప్రదర్శనలు చేయ్యడం, నిరసన తెలపడం నానాటికి పెరిగిపోయాయి. ఈ నిరసనలు ఒక్కో దేశం నుండి ఇంకో దేశానికి అగ్గిలా రాజుకున్నాయి. ఆస్ట్రియా, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ వంటి దేశాలన్నింటా ఇలాంటి ఉద్యమాలు నడిచాయి.

మార్కెట్లలో కొట్లమీద పడి ధ్వంసం చేయడం, వ్యాపారస్తులను చితకబాదడం పరిపాటి అయిపోయింది. అయితే ఇలాంటి కార్యక్రమాల వల్ల ప్రయోజనం లేకుండాపోయిందని, ప్రియం అయిపోయిన ధరలకు మూలకారణం ప్రభుత్వం అనుసరిస్తున్న రాజకీయ విధానాల్లో ఉందని శ్రామిక మహిళలు అర్థం చేసుకున్నారు. పరిస్థితుల్లో మార్పు రావాలంటే రాజకీయాల్లో మార్పు తీసుకురావాలనీ, అందుకోసం మహిళలకూ ఓటింగ్ హక్కు కల్పించాలనే డిమాండ్ ముందుకొచ్చింది. ఈ హక్కు సాధన కోసం ప్రతిదేశంలో విధిగా మహిళా దినోత్సవం నిర్వహించాలని నిర్ణయించుకున్నారు. ప్రపంచవ్యాప్తంగా మహిళలందరికీ ఈ హక్కుల సాధన సాధ్యం కావాలంటే ఉమ్మడి లక్ష్యంతో అంతర్జాతీయ సంఘీభావంతో ఉద్యమాలు నడపాలనీ, ఏటా శ్రామిక మహిళల నిర్మాణ బలాన్ని అంచనా వేసుకుంటూ సోషలిజం సాధన దిశగా ఎలాంటి కార్యక్రమాలు రూపొందించుకోవాలో మహిళా దినోత్సవం రోజున సమీక్షించుకోవాలనీ నిర్ణయం జరిగింది.

**తొలి అంతర్జాతీయ మహిళాదినోత్సవం:**

సోషలిస్టు మహిళల రెండవ అంతర్జాతీయ సదస్సు ఇచ్చిన ఈ పిలుపు కాగితాలకే పరిమితం కాలేదు. 1911 మార్చి 19వ తేదీని ఎంచుకోడానికి ఒక ప్రాముఖ్యత ఉంది. జర్మన్ శ్రామిక వర్గానికి ఆరోజుకు ఉన్న ప్రాముఖ్యత రీత్యా మార్చి 19వ తేదీని ఎంచుకుందామని జర్మన్ మహిళా ప్రతినిధివర్గం ఆ సదస్సులో సూచించింది. శ్రామిక వర్గ ప్రజల సాయుధ తిరుగుబాటుకు రష్యా రాజు తలొగ్గిన రోజు 1911 మార్చి 19. రాజు ప్రజలకు అనే వాగ్దానాలు చేశాడు. మహిళలకు ఓటు హక్కు కల్పిస్తానని కూడా తొలిసారిగా అంగీకరించాడు. అయితే ఈ తరువాత ఈ వాగ్దానాల్లో అనేకం నిలబెట్టుకోలేదు. అదివేరే సంగతి. జనవరి 11 నుండి జర్మనీ, ఆస్ట్రియాలలో మహిళా దినోత్సవం నిర్వహణకు చురుకుగా ఏర్పాట్లు సాగాయి. ఒక భారీ ప్రదర్శన నిర్వహించాలని నోటిమాటగా ప్రచారం చేశారు. పత్రికలకు ప్రకటనలు ఇచ్చారు. అయితే ఇంకో వారం రోజుల్లో మహిళా దినోత్సవం జరగనుంది అనగా రెండు పత్రికలు మాత్రం ఈ వార్తతో పాటు కొన్ని వ్యాసాలూ ప్రచురించాయి. 'జర్మన్ మహిళలకు ఓటుహక్కు', 'ఆస్ట్రియాలో మహిళా దినోత్సవం', 'మహిళలు-పార్లమెంటు', 'శ్రామిక మహిళలు-మున్సిపల్ వ్యవహారాలు', 'గృహిణులకు రాజకీయాలతో పనేంటి' వంటి శీర్షికలతో పత్రికలు నిండిపోయాయి. సమాజంలో, ప్రభుత్వంలో మహిళా సమానత్వ సాధన అవసరం, సాధ్యాసాధ్యాల గురించి క్షుణ్ణమైన విశ్లేషణ నడిచింది. దాదాపు అన్ని వ్యాసాల్లో వెలిబుచ్చిన అభిప్రాయల సారంశం ఒక్కటే. పార్లమెంట్‌ను మరింత ప్రజాస్వామీకరించాలంటే మహిళలందరికీ సార్వత్రిక వయోజన ఓటు హక్కు కల్పించాల్సిందే.

1911 మార్చి 19న తొలి అంతర్జాతీయ మహిళా దినోత్సవం నిర్వహించారు. అంచనాలకు మించి జయప్రదమైంది. ఈ కార్యక్రమం. జర్మనీ, ఆస్ట్రియాలలో శ్రామిక మహిళా ప్రదర్శనలు సముద్రంలా పోటెత్తిపోయాయి. చిన్న చిన్న పట్టణాలు, పల్లెల్లో కూడా మహిళా సమావేశాలు జయప్రదంగా జరిగాయి. చాలా చోట్ల జాగాలేక సమావేశానికి వచ్చిన మగ వారిని వెళ్లిపొమ్మని చెప్పాల్సిన పరిస్థితి వచ్చిందంటే మహిళా దినోత్సవం ఏ మేరకు విజవంతమైందో అంచనా వేసుకోవచ్చు. శ్రామిక మహిళల సమరశీలతకు అద్దం పట్టిన తొలిప్రదర్శన ఇది. మగవాళ్లు ఇంటి పట్టునే ఉండి పిల్లల ఆలనాపాలనా చూసుకున్నారు. అప్పటికే వంటింటికే పరిమితమైన గృహిణులు తొలిసారిగా వీధికెక్కారు. అప్పట్లోనే దాదాపు 30,000 మంది మహిళలు ఆ భారీ ప్రదర్శనలో పాల్గొన్నారు. పోలీసులు వాళ్ళు చేపట్టిన బ్యానర్లు లాక్కోవాలని ప్రయత్నించారు. శ్రామిక మహిళలు వాళ్ల ప్రయత్నాలను అడ్డుకున్నారు. తోపులాట జరిగింది. ఇంకాస్త ఉంటే పోలీసులు ఆ ప్రదర్శనను రక్తపుటేరుల్లో ముంచెత్తేవారు. కాని పార్లమెంట్‌లో సోషలిస్టు ప్రతినిధులుగా ఉన్న వాళ్లు జోక్యం చేసుకుని దాన్ని నివారించారు. 1913లో అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని మార్చి 8వ తేదీకీ మార్చారు. అప్పటి నుండి మార్చి 8 మహిళా దినోత్సవంగా, శ్రామిక మహిళల సమరశీలతకు కొండ గుర్తుగా మారింది.

**మహిళా దినోత్సవం అవసరం ఉందా?**

అమెరికా, యూరప్ దేశాలలో మహిళా దినోత్సవం అద్భుతమైన ఫలితాలు సాధించింది. బూర్జువా పార్లమెంట్లు అప్పటిదాకా కార్మికులకు ఎలాంటి రాయితీలు ఇవ్వడానికి గానీ, మహిళా సమస్యల పట్ల స్పందించడానికి గానీ ఏ మాత్రం సిద్ధపడలేదు. ఎందుకంటే వాళ్లకు తక్షణం సోషలిస్టు విప్లవాల నుండి ఎదురయ్యే ప్రమాదం ఏదీ లేదు. అయితే మహిళా దినోత్సవం నిర్వహణ ఒకమేరకు కదలిక సాధించింది. రాజకీయంగా అంత చైతన్యవంతం కాని శ్రామిక మహిళా సోదరీమణులకు ఒక అద్భుతమైన పోరాట రూపాన్ని అందించింది. మహిళా దినోత్సవానికి ఉద్దేశించిన సమావేశాలు, ప్రదర్శనలు, పోస్టర్లు, కరపత్రాల, దినపత్రికల పట్ల వారి ఆసక్తి పెరిగింది. రాజకీయంగా

బాగా వెనుకబడిన గ్రామీణ ప్రాంత శ్రామిక మహిళల్లో కూడా ఇది చైతన్యం కలిగించింది. 'మా పండుగ రోజు' అనే ఉత్సాహం కలిగి సమావేశాలు, ప్రదర్శనలవైపు పరిగెట్టించింది. ఏటేటా జరిగే ఈ మహిళా దినోత్సవం ప్రభావంతో కార్మిక సంఘాలలో, సోషలిస్టు పార్టీలలో మహిళలు ఎక్కువగా వచ్చి చేరసాగారు. వీటి నిర్మాణబలం పెరిగింది. రాజకీయ చైతన్యం అభివృద్ధి అయింది.

మహిళా దినోత్సవం వల్ల ఒకగూడిన మరో ఫలితం ఏమంటే కార్మికుల మధ్య అంతర్జాతీయ సంఘీభావం పెంపొందింది. వివిధ దేశాలలో ఉన్న పార్టీలు ఈ సందర్భాన్ని పురస్కరించుకుని ఏర్పాటు చేసే సమావేశాలకు ఇతర దేశాల వక్తలను పిలిచి వారి అనుభావాలను పంచుకునేవారు. జర్మన్ కామ్రేడ్‌లు ఇంగ్లాండ్ వెళ్తే, ఇంగ్లాండ్ కామ్రేడ్‌లు హాలాండ్...ఇలా వేర్వేరు దేశాలకు వెళ్లేవారు. కార్మిక వర్గం మధ్య అంతర్జాతీయ సుహృద్భావం బలపడి తద్వారా కార్మిక వర్గం పోరాటపటిమ మరింత పెంపొందింది. ఇవన్నీ శ్రామిక మహిళా దినోత్సవ సమర శీలత ఫలితాలే. శ్రామిక మహిళల నిర్మాణానికి, వారి చైతన్య స్థాయిని పెంపొందించేందుకు మహిళా దినోత్సవ నిర్వహణ ఎంతగానో ఉపకరించింది. ఒక్క మాటలో చెప్పుకోవాలంటే కార్మికవర్గం మెరుగైన భవిష్యత్తు కోసం జరిగే పోరాటాలకు ఊతంగా నిలిచింది.

**రష్యాలో శ్రామిక మహిళా దినోత్సవం.**

రష్యాలో 1913లో తొలిసారిగా శ్రామిక మహిళా దినోత్సవం జరిగింది. అప్పట్లో కార్మిక వర్గం. రైతాంగం జారు చక్రవర్తి ఉక్కు పిడికిట నలిగిపోతోంది. అలాంటి నేపథ్యంలో శ్రామిక మహిళా దిన్సోతవం జరుపుకోవడం గానీ, ఆ పేరిట బహిరంగంగా ప్రదర్శనలకు దిగడం కానీ ఊహకైనా తట్టని అంశం. అయినా సంఘటిత శ్రామిక మహిళలు మహిళాదినోత్సవాన్ని నిర్వహించుకున్నారు. కార్మికవర్గం కోసం నడిపిన రెండు పత్రికలలో – బోల్షివిక్‌లు నడిపిన 'ప్రావ్దా' మెన్షివిక్‌లు నడిపిన 'లూక్'లలో అంతర్జాతీయ మహిళాదినోత్సవం మీద అనేక వ్యాసాలు ప్రచురితమయ్యాయి. ప్రత్యేక వార్తలు, ఇతర దేశాలలో జరిగిన మహిళా దినోత్సవ చాయా చిత్రాలతో పాటు కామ్రెడ్ క్లారాజెట్కిన్, బెబెల్ వంటి హేమాహేమీల సందేశాలూ ప్రచురించాయి.

సమావేశాలు నిషేదించబడిన ఆ చీకటి రోజుల్లో పెట్రోగ్రాడ్‌లోని 'కాలాషి కోవెన్కీ ఎక్స్ఛేంజ్'లో పార్టీ నాయకత్వంలో మహిళా సమస్య మీద బహిరంగ చర్చావేదిక నిర్వహించారు. ప్రవేశ రుసుము ఐదు కొపెక్కులుగా నిర్ణయించారు. అది చట్టవ్యతిరేక సమావేశం అయినా హాలు పూర్తిగా నిండిపోయింది. పార్టీ సభ్యులు కొందరు ప్రసంగించారు. నాలుగు గోడల మధ్య పకడ్బందీగా ఈ సమావేశం నిర్వహించినా, ముగింపుకు వచ్చేసరికి పోలీసులకు ఉప్పంది జోక్యం చేసుకున్నారు. వక్తలను అనేకమందిని అరె చేశారు. జారుచక్రవర్తి తీవ్ర నిర్భంధంలో ఉండి కూడా రష్య మహిళలు అంతర్జాతీయ మహిళా దినోత్సవంతో మమేక కావడానికి ఇలాంటి సాహసోపేత కార్యక్రమం చేపట్టారు. రష్యా పెరుగుతున్న ప్రజా చైతన్యానికి ఈ సమావేశం ఒక ప్రతీక. జా చక్రవర్తి చెరసాలలు, ఉరికొయ్యలు కార్మికుల పోరాట స్ఫూర్తిముం శక్తి విహీనంగా తయారయ్యాయి. 1914లో శ్రామిక మహి దినోత్సవం ఇంకాస్త మెరుగ్గా జరిగింది. కార్మికులు, వార పత్రిక ఇది తమ సంబరంగా భావించారు. పోలీసు జోక్యం వల్ల ప్రదర్శ నిర్వహించడం సాధ్యం కాలేదు. శ్రామిక మహిళా దినోత్సవ ఏర్పాట్లతో సంబంధం ఉన్న ప్రతి ఒక్కరినీ జైల్లో పెట్టారు. అందుల కొంతమందిని సైబీరియాకు తరలించారు. శ్రామిక మహిళలక ఓటు హక్కు కల్పించాలనే నినాదం సహజంగానే రష్యాలో జా చక్రవర్తి రాజరికాన్ని కూలదోసే బహిరంగ పిలుపుగా మలు తీసుకుంది.

**సామ్రాజ్యవాద కాలంలో శ్రామిక మహిళా దినోత్సవం:**

ఇంతలో మొదటి ప్రపంచ యుద్ధం మొదలైంది. దేశదేశా కార్మికవర్గం రక్తపిపాసి యుద్ధ కోరల్లో చిక్కుకుంది. 1915-191 సంవత్సరాలల్లో ఇతర దేశాల్లో శ్రామిక మహిళా దినోత్సవ పేలవంగా జరిగింది. వామపక్ష, సోషలిస్టు భావాలతో ప్రభావిత అయిన రష్యన్ మహిళలు మాత్రం బొల్షివిక్ పార్టీ పిలుపు మేరక మార్చి 8 మహిళా దినోత్సవాన్ని యుద్ధానికి వ్యతిరేకంగా శ్రామి మహిళా దినంగా మలిచే ప్రయత్నం చేశారు. కానీ జర్మనీ తదిత దేశాల్లో సోషలిస్టుల ముసుగులో ఉన్న విప్లవ ద్రోహులు మహిళ కామ్రేడ్లు చేసే ప్రయత్నాలను సాగనివ్వలేదు. తటస్థ దేశాలల జరుగుతున్న అంతర్జాతీయ మహిళా సదస్సులకు హాజరు కావడాని అవసరమైన పాస్‌పోర్టులు జారీ చేయడానికి నిరాకరించారు మహిళా దినోత్సవాన్ని భగ్నం చేయాలని బూర్జువా పాలకుల ప్రయత్నించి విఫలమయ్యారు. అంతర్జాతీయ సంఘీభావ వెల్లివిరిసింది. 1915లో నార్వేలో మాత్రమే మహిళా దినోత్సవ సందర్భంగా ఒక అంతర్జాతీయ ప్రదర్శన జరిగింది. దీనికి రష నుండి, ఇతర తటస్థ దేశాల నుండి మహిళా ప్రతినిధుల హాజరయ్యారు. రష్యాలో ఆ ఏడాది మహిళా దినోత్సవ నిర్వహించాలన్న ఊసే తలెత్తలేదు. జారు చక్రవర్తి అధికా మదోన్మత్తతతో, సాయుధ సైనిక పశుబలం అందుకు ఎలాం వెసులుబాటూ ఇవ్వలేదు.

ఇంతలోనే రానేవచ్చింది. మహత్తర 1917 వ సంవత్సరం ఆకలి, ఎముకలు కొరికే చలి, యుద్ధనే విచారణలు, శిక్షలు...ఇవన్నీ రష్యా శ్రామిక-రైతాంగ మహిళల ఓర్పును చంపేసాయి. 191 మార్చి 8న (రష్యా కాలమాన ప్రకారం ఫిబ్రవరి 23న) శ్రామి

మహిళలు నిర్భయంగా పెట్రోగ్రాడ్ వీధులకెక్కారు. వారిలో కొందరు శ్రామికులు, ఇంకొందరు సైనికుల భార్యలు. 'మా పిల్లలను బతికించుకోవడానికి ఇంత రొట్టె ఇవ్వండి", 'కందకాల్లో ఉన్న మా భర్తలను వెనక్కి రప్పించండి' అన్న నినాదాలు వెల్లువెత్తాయి. సముద్రపు అలల్లా ఎగసి పడుతున్న ప్రజాగ్రహాన్ని చూసి జారు చక్రవర్తి రక్షణ దళాలు చేష్టలుడిగి మిన్నకుండి పోయాయి. మహిళల మీద తమ ప్రతాపం చూపడానికి ఏమాత్రం సాహసించలేకపోయాయి. ఆ రోజు చారిత్రాత్మక దినంగా మిగిలిపోయింది రష్యా చరిత్రలో. రష్యన్ మహిళలు శ్రామిక వర్గ విప్లవ దివిటీని చేతబట్టి పాడు ప్రపంచానికి ఒక మూల నిప్పుబెట్టారు. ఫిబ్రవరి విప్లవానికి నాంది ఈ శ్రామిక మహిళా దినోత్సవ నిర్వహణే.

**'సమరానికి 'సై'**

పదేళ్ల క్రితం (1910) మహిళలకు రాజకీయ సమానత్వం కావాలని, సోషలిజాన్ని సాధించాలనే లక్ష్యంతో శ్రామిక మహిళా దినోత్సవం రష్యాలో మనం జరుపుకున్నాం. ఈ లక్ష్యాన్ని సాధించుకున్నాం కూడా. సోషలిస్టు రష్యాలో సార్వత్రిక వయోజన ఓటింగుహక్కు, ఇతర పౌరహక్కుల కోసం శ్రామిక-రైతాంగ మహిళలు పోరాడాల్సిన అవసరం లేకుండా పోయింది. ఈ హక్కులను సోషలిస్టు వ్యవస్థ వారికి కట్టబెట్టింది. పురుషులతో సమానంగా స్త్రీలకు అన్ని హక్కులు దక్కాయి. జీవితాన్ని మరింత మెరుగ్గా తీర్చిదిద్దుకునే అవకాశాలు మహిళలకు పుష్కలంగా లభించాయి. కేవలం ఓటుహక్కు కాకుండా సమిష్టి క్షేత్రాల్లో, ఉమ్మడి సంస్థలలో మహిళలకు భాగస్వామ్యం దక్కింది.

హక్కులను సాధించుకోవడంతోనే మనం తృప్తి పడకూడదు. ఆ హక్కులను ఎలా ఉపయోగపెట్టుకోవాలే మెళకువ సంపాదించుకోవాలి. ఉదాహరణకు ఓటు హక్కునే తీసుకుందాం. ఆ ఓటు హక్కును స్వీయ ప్రయోజనాలకు, కార్మిక వర్గ శ్రేయస్సుకు, రాజ్య ప్రయోజనాలకు అనుకూలంగా ఎలా ఉపయోగించుకోవాలో అర్థం చేసుకుంటేనే ఆ హక్కు మన చేతిలో వజ్రాయుధంగా మారుతుంది.

సోవియట్‌లో కార్మికవర్గం అధికారంలోకి వచ్చి రెండేళ్లయింది. అయితే మన జీవితాల్లో స్వల్పకాలంలోనే మౌళికమైన మార్పులు ఇంకా రాలేదు. మన సమాజంయొక్క అణిచివేత స్వభావం చీకటికోణాలు ఇంకా మనల్ని వెన్నంటి వస్తూనే ఉన్నాయి. దీనికి తోడు చుట్టూ ఉన్న ప్రపంచం అలాగే ఉంది. ఒక్క రష్యాలో మాత్రమే ఇందుకు భిన్నంగా కమ్యూనిస్టు సమాజ స్థాపన లక్ష్యంగా కృషి జరుగుతోంది. శ్రామిక మహిళల మీద కుటుంబ బంధనాలు, ఇంటి పనిభారం, వ్యభిచారం వంటి ప్రభావాలు ఇంకా బలంగానే ఉన్నాయి. ఇవన్నీ కేవలం చట్టాలు చేసినంత మాత్రాన తొలగిపోవు. శ్రామిక రైతాంగ మహిళలు ఉమ్మడిగా తమ శక్తియుక్తులన్నీ కేంద్రీకరించి పై బంధనాల నుండి విముక్తి కోసం కృషిచేస్తే తప్ప రష్యాలో కమ్యూనిస్టు వ్యవస్థ స్థాపన సాకారం కాదు. ఈ క్రమాన్ని వేగవంతం చేయాలంటే ముందు కుప్పకూలిన రష్యన్ ఆర్థిక వ్యవస్థను నిలబెట్టుకోవాలి. అందుకు మనం రెండు తక్షణ కర్తవ్యాలు నిర్దేశించుకోవాలి. మొదటగా రాజకీయంగా చైతన్యవంతమైన కార్మికవర్గంతో బలమైన నిర్మాణ వ్యవస్థను ఏర్పాటు చేసుకోవాలి. రవాణా వ్యవస్థను పునరుద్ధరించుకోవాలి. మన శ్రామిక సైన్యం తలుచుకోవాలే గాని త్వరలోనే మనం ఆవిరి ఇంజన్‌లు తయారు చేయగలం. రైల్వే వ్యవస్థనూ సరిగా పనిచేయించగలం. తద్వారా ఇవాళ శ్రామిక ప్రజాజీవనానికి కావల్సిన ఆహారం, వంటచెరుకు సమకూరుతుంది. రవాణ వ్యవస్థను మళ్లీ గాడిన పెడితే కమ్యూనిస్టు విజయం వేగవంతమవుతుంది.

కమ్యూనిజం వర్ధిల్లుతేనే మహిళలకు మౌలికమైన సమానత్వం లభిస్తుంది. అందుకు ఈ యేడాది మనం జరుపుకోబోయే శ్రామిక మహిళా దినోత్సవం సందేశం ఎలా ఉండాలంటే శ్రామిక రైతాంగ మహిళలు తల్లులు, చెల్లెళ్లు, గృహిణులు అందరూ ఏకతాటిపై రైల్వే వ్యవస్థ పునర్మిర్మాణానికి కృషి చేస్తున్న శ్రామిక వర్గానికి అన్ని విధాలా అండదండలుగా నివ్వాలి. ఆహారం, వంటచెరుకు, ముడిఖనిజాల సాధన కోసం జరిగే కృషిని జయప్రదం చేయాలి. గతేడాది శ్రామిక మహిళా దినోత్సవం సందర్భంగా ఎర్రదండుకు సకల విజయాలు కలగాలి అన్న నినాదం తీసుకున్నాము. ఎర్రదండు విజయానికి మహిళాలోకం అందించిన తోడ్పాటు అంతా ఇంతాకాదు. అలాగే ఈ ఏడాది అదే స్పూర్తితో శ్రామిక దండు తమ లక్ష్యన్ని నెరవేర్చడానిక కావల్సిన అండదండలు అందించాలి. ఎర్రదండు నిర్మాణం క్రమశిక్షణగల సంస్థ. త్యాగాలకు వెరువని సంస్థ. అందుకే శత్రువుమీద విజయం సాధించగలిగింది. గాడితప్పిన రవాణా, ఆర్థిక వ్యవస్థలు, ఆకలి, ఆరోగ్యం ఇవే మనముందున్న అంతర్గత శత్రువులు. వీటిపై పైచేయి సాధించడానికి కష్టపడి పనిచేసే స్వీయక్రమశిక్షణ, త్యాగబుద్ధి కలిగిన శ్రామిక దండు అవసరం ఎంతైనా ఉంది. అందుకే ప్రతి ఒక్కరూ ఈ దండులో చేరండి. విజయం సాధించడానికి మీలో ప్రతి ఒక్కరూ వీరికి తోడ్పడండి. శ్రామిక మహిళా దినోత్సవం నూతన కర్తవ్యాలు మహత్తర అక్టోబర్ విప్లవం మహిళలలకు పురుషులతోపాటు సమానత్వం ఇచ్చింది. పౌరహక్కులూ ఇచ్చింది.

నిన్న మొన్నటిదాక రష్యా శ్రామిక మహిళలు తీవ్రమైన అణచివేతకు గురైన దురదృష్టవంతులు, కాని ఇవాళ మిగతా ప్రపంచ దేశాల మహిళల ముందు గర్వంగా తలెత్తుకునే స్థితిలో ఉన్నారు. అంతేకాదు. మహిళలు రాజకీయ సమానత్వం సాధించాలంటే

రష్యాలో మాదిరి శ్రామికవర్గ నియంతృత్వం తప్ప వేరే మార్గం లేదని పద నిర్దేశం చేశారు. ఇప్పటికీ పెట్టుబడిదారీ దేశాల్లో మహిళల పరిస్థితి క్లిష్టంగానే ఉంది. పనిభారం బండెడు, సౌకర్యాలు అరకొర, అప్పులు నామ్‌కే వాస్తే తీరుగా ఉంది. ఇలా మహిళల పరిస్థితి ఈ దేశాల్లో శ్రామిక మహిళల పరిస్థితి బలహీనంగా ఉంది. అయితే నార్వే, ఆస్ట్రేలియా, ఫిన్‌లాండ్ వంటి దేశాల్లో, ఉత్తర అమెరికా ఖండంలోని కొన్ని రాష్ట్రాల్లో మొదటి ప్రపంచ యుద్ధానికన్నా ముందునుండే మహిళలు పౌరహక్కులు సాధించుకున్న మాట వాస్తవమే. జర్మనీలో ౖకైజర్ చక్రవర్తి రాజరికాన్ని కూలదోసి బూర్జువా రాజ్యాన్ని నిలబెట్టారు. రాజకీయ వాదులు నడిపిన ఈ ప్రభుత్వంలో పార్లమెంటుకు 36 మంది. మహిళలు ఎంపికయ్యారు. వారిలో ఒక్క కమ్యూనిస్టు లేరు. అలాగే 1919లో ఇంగ్లాండులో తొలిసారిగా ఒక మహిళా ప్రతినిధి పార్లమెంటుకు ఎన్నికైంది. ఆమెను అమ్మగారూ అనేవారు. మన అమ్మలాంటిది కాదు ఆవిడ నిజంగా అమ్మగారే. కులీన కుటుంబం నుండి వచ్చిన ఒక మహిళా రాజ వంశస్తురాలు. ఫ్రాన్స్‌లో మహిళలకు ఓటింగ్ హక్కు కల్పించాలనే అంశంమీద చర్చ నడుస్తూనే ఉంది. అయితే భూర్జువా పార్లమెంటు చట్టంలో శ్రామిక మహిళలకు ఏం హక్కులు ఒనగూరుతాయి. అధికారం అంతా పెట్టుబడిదారీ చేతుల్లో, సంపద మజమానుల చేతుల్లో ఉన్నంతకాలం శ్రామిక మహిళలకు మిగిలేది ఇంటా బయటా సాంప్రదాయభానినత్వమే తప్ప రాజకీయ హక్కులు నామమాత్రంగానే అలంకార ప్రాయంగానే మిగులుతాయి.

ఒక పక్కన బోల్షివిక్ విప్లవం బూచీ పొంచి ఉంది. కాబట్టి శ్రామిక మహిళలకు ఓటు హక్కును నజరానాగా అందించాలని ఫ్రాన్స్ భూర్జువా వర్గం పాచిక వేసింది. కాని ఘనమైన భూర్జువా అయ్యలు 'మీరు ఇప్పటికే చాలా అలస్యం చేశారు. మహోత్తర అక్టోబర్ విప్లవం అనుభవం నుండి ఫ్రాన్స్, ఇంగ్లాండ్ తదితర దేశాల్లోని శ్రామిక మహిళలకు ఒక విషయం స్పష్టమైంది. శ్రామికవర్గ నియంతృత్వం ద్వారా సోవియట్‌లో చేపట్టిన అధికారం ద్వారా మాత్రమే మహిళలకు సమానత్వం సిద్ధిస్తుందని అర్థం చేసుకున్నారు. శతాబ్దాల తరబడి దాస్యశృంఖలాలలో చిక్కుకొని బనాయించిన దోపిడీ అణిచివేతలు స్వస్తిపలకడం ఒక్క కమ్యూనిజం తోనే సాధ్యమని అవగాహనకు వచ్చారు. ఒక పక్కన భూర్జువా పార్లమెంటులో మహిళలు ఓటు హక్కుకోసం పోరాడుతున్న నేపథ్యంలో జరుపుకోవాల్సిన శ్రామిక మహిళాదినోత్సవం సందర్భంగా మనం మన కర్తవ్యాన్ని ఎంచుకోవాలి. మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఇచ్చిన నినాదాల వెనుక అత్యధిక శ్రామిక మహిళా వర్గాన్ని అదర్శంగా తీసుకోమని చెప్పాలి. ఈ ప్రపంచాన్ని దోచుకుతింటున్న పెట్టుబడిదారీ వర్గానికి వ్యతిరేకంగా విశాల ప్రతిఘటనా వేదికలో దేశదేశాల శ్రామిక మహిళలు భాగస్వాములు కావాలి. బూర్జువా పార్లమెంటరీ తత్వాన్ని తెగనాడాలి. ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిజం విజయం సాధించేందుకు కంకణ బద్ధులు కావాలి. నూతన ప్రపంచ క్రమం అది పెట్టుబడీదారి దేశాలు చెప్పుకుంటున్న వ్యవస్థలో మహిళల స్థితిగతులు ఆశించిన స్థాయిలో మెరుగుపడలేదనే వాస్తవాన్ని అ దేశాల్లోని మహిళావర్గం గుర్తించింది. పెట్టుబడీదారి విధానాన్ని కూలదోసే కమ్యూనిజాన్ని స్థాపించడం ఒక్కటే సమస్యకు పరిష్కారం. కేవలం ఓటు హక్కుకోసం సీట్లకోసమే కాకుండా మానవాళి సంపూర్ణ విముక్తి కోసం మహిళా సమానత్వం కోసం ఇకమీదట యుద్ధం జరగాలి. ఈ యుద్ధంలో మహిళలు గెలవాలి. అలా గెలవాలంటే కమ్యూనిజం తప్ప వేరే మార్గం లేదు. ప్రపంచ పెట్టుబడీదారి విధానం నశించాలి!, బూర్జువా ప్రపంచ సాంప్రదాయాలైన అసమానతలు, హక్కుల లేమి తొలగిపోవాలి!!, ప్రపంచ శ్రామిక మహిళల్లారా ఏకంకండి!!!, శ్రామికవర్గ నియంతృత్వంలో శ్రేయోరాజ్య స్థాపనకు భుజం భుజం కలపండి.

**క్యాంపస్ వాయిస్‌పై మీ అభిప్రాయాలు తెలపండి. ప్రచురణకై సమకాలీన అంశాల మీద వ్యాసాలు, పుస్తక సమీక్షలు, సాహిత్య వార్తలు, కవితలు, పాటలు వ్రాసి పంపండి. మీ రచనలు కాగితానికి ఒకే వైపు స్పష్టంగా, అర్థమయ్యేలాగా రాసి పంపండి. మీ చేతిరాత అస్పష్టంగా ఉంటే తప్పులు దొర్లే ప్రమాదం ఉంది.**

**–ఎడిటర్**

# విద్యార్థుల జీవితాలతో చెలగాడమాడుతున్న ప్రభుత్వం

-ఎం. సురేష్

పాలకులు విద్యనందించే బాధ్యత నుండి తప్పుకొని విద్యను ప్రైవేటీకరించే, కార్పోరేటీకరించే చర్యలను గత రెండు దశాబ్దాల కాలంలో మరింత వేగవంతంచేశారు. సామ్రాజ్యవాద దోపిడీ ప్రయోజనాలకు లోబడిన భారత పాలకులు ప్రపంచీకరణ, ఆర్థిక సరళీకరణ విధానాల అమలు నేపథ్యంలో విద్యారంగంలో ముఖ్యంగా సమాచార, శ్రాస్తసాంకేతిక రంగాల్లో దేశంలో ఆఘమేఘాలమీద పురోగమిస్తున్నట్లుగా భ్రమలు కల్పించారు. ఇదే అదనుగా దేశవ్యాపితంగానూ, ముఖ్యంగా మన రాష్ట్రంలోనే వందలాది ప్రైవేటు ఇంజనీరింగ్, ఎంసిఏ, ఎంబిఏ కళాశాలలకు అనుమతినిచ్చారు.

1997లో మన రాష్ట్రంలో ఇంజనీరింగ్ కళాశాలల సంఖ్య 37. కాగా 2004లో 236కు 2009లో ఆ సంఖ్య 537కి పెరిగింది. 2004లో ఎంసిఏ కళాశాలల సంఖ్య 271 కాగా, 2009 నాటికి 500కి; 2004లో ఎంబిఏ కళాశాలల సంఖ్య 207 కాగా, 2009 నాటికి 611కి; 2004లో ఫార్మసీ కళాశాలల సంఖ్య 45 నుండి 2009 నాటికి 270 కి పెరిగింది.

ఇంజనీరింగ్ కళాశాలల ప్రమాణాలను నిర్ధేశించి, వాటికి అనుమతినివ్వాల్సిన ఎఐసిటిఇ వంటి చట్టబద్ధ సంస్థలను ప్రలోభ పర్చడం ద్వారా, కనీస పాటి భవనాలు, ప్రయోగశాలలు, వసతి సౌకర్యాలు బోధనా సిబ్బంది లేకున్నా అనేక ప్రైవేటు కళాశాలల యాజమాన్యఆలు, అత్యంత 'తెలివి'గా అనుమతులను సొంతం చేసుకున్నాయి. వృత్తి, సాంకేతిక విద్యపట్ల విద్యార్థులు, తల్లిదండ్రులలో కల్పించిన డిమాడ్‌ను ఆసరా చేసుకొని ఈ ప్రైవేట్ కళాశాల యాజమాన్యాలు విచ్చలవిడిగా విద్యార్థుల నుండి ఫీజులు, డోనేషన్ల రూపంలో పెద్ద ఎత్తున డబ్బును దండుకుంటున్నాయి.

విద్యావేత్తలు, ప్రజాతంత్రవాదులు, మేధావులు, వివిధ విద్యార్థి సంఘాలు-ప్రైవేటు యాజమాన్యాలు ఇబ్బడిముబ్బడిగా నెలకొల్పుతున్న వృత్తి, సాంకేతిక కళాశాలల స్థాపనను వ్యతిరేకిస్తూ ప్రభుత్వమే ఆ బాధ్యతను చేపట్టి, నిర్వహించాలని డిమాండ్ చేసినప్పటికీ 'చెవిటివాని ముందు శంఖమూదిన' చందమైంది. ప్రభుత్వం ప్రైవేటు యాజమాన్యాల కొమ్ముగాసింది.

రాష్ట్రంలో రాజశేఖర్‌రెడ్డి నాయకత్వంలో మొదటి విడత కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చిన చివర సంవత్సరంలో (2008లో), 2009 ఎన్నికలకు వెళ్ళబోయే ముందుగా వృత్తి, సాంకేతిక కళాశాలల్లో లక్ష రూపాలల్లోపు వార్షికాదాయం వున్న విద్యార్థులందరి బోధనా రుసుమును ప్రైవేటు యాజమాన్యాలకు ప్రభుత్వమే తిరిగి చెల్లిస్తుందని ప్రకటించాడు. 'పేదవాడైనంత మాత్రాన ఉన్నత విద్యకు అనర్హుడా? అని ప్రశ్నిస్తూ ప్రతి కుటుంబంలో ఒక్కరినైనా ఉన్నత విద్యావంతులుగా తీర్చిదిద్దాలనే లక్ష్యంతో ఈ పథకం ప్రవేశపెడుతున్నట్లుగా ఆనాడు రాజశేఖర్‌రెడ్డి ప్రభుత్వం ఆర్భాటంగా ప్రకటించింది.

ఈ పథకం అమలులోని సాధ్యాసాధ్యాలను ప్రక్క నుంచి, అప్పటికే పెద్దఎత్తున పెంచిన బోధనారుసుముల ప్రకారం లెక్కిస్తే ప్రభుత్వం వేల కోట్ల రుపాయల ప్రజాధనాన్ని ప్రైవేటు






యాజమాన్యాలకు చెల్లించాల్సి రావటాన్ని ప్రజాతంత్రవాదులు, విద్యారంగా మేధావులు ఆనాడే ఆక్షేపించారు, ప్రైవేటు యాజమాన్యాలకు ఏటా చెల్లించే వందల కోట్ల రుపాయలతో ప్రభుత్వమే అనేక ఉన్నత వృత్తి, సాంకేతిక కళాశాలలను నెలకొల్పి, నిర్వహించవచ్చునని గణాంకాలతో సహా వివరించారు. వీటన్నిటినీ త్రోసిపుచ్చి రాజశేఖర్ రెడ్డి ప్రభుత్వం ఆర్భాటంగా ఫీజు రీఎంబర్స్‌మెంట్ విధానాన్ని నిరాటంకంగా కొనసాగిస్తామని ప్రకటించింది.

సహజంగానే పేద, మధ్య తరగతి వర్గాలకు చెందిన కొందరు విద్యార్థులు ఈ విధానం ద్వారా ప్రయోజనం పొందగలుగుతామనుకున్నారు. కానీ ఆ మురిపెం ఎన్నాళ్ళో సాగలేదు.

రెండవ పర్యాయం రాజశేఖర్ రెడ్డి అధికారంలోకి వచ్చిన వెంటనే (2009లో) ఒక్కొక్కటిగా వడపోత విధానాలు ప్రారంభమయ్యాయి. ఫీజురీఎంబర్స్‌మెంట్ అర్హతకు కావలసిన నిబంధనలను ప్రభుత్వం కఠినతరం చేసింది.

రాజశేఖర్‌రెడ్డి మరణాంతరం అధికారంలోకి వచ్చిన ముఖ్యమంత్రులు రోశయ్య, కిరణ్‌కుమార్‌లు అదే బాటలో సాగుతున్నారు. రీఎంబర్స్‌మెంట్‌కు అనేక మందిని అనర్హులుగా ప్రకటించి వారికి ఇంజనీరింగ్ వృత్తి కళాశాలల్లో విద్యావకాశాలను నిరోధించటంతో పాటు, ప్రైవేటు కళాశాలల యాజమాన్యాలకు చెల్లించ వలసిన బోధనారుసుముల చెల్లింపులలో కోత విధించటం, సకాలంలో చెల్లించకపోవటం ప్రారంభమైంది. దీనిని సాకుగా తీసుకొని ప్రైవేటు కళాశాల యాజమాన్యాలు పలు దఫాలుగా ప్రభుత్వంపై వత్తిడి పెంచుతూ వచ్చాయి. సకాలంలో బోధనా రుసుము తిరిగి చెల్లించకుంటే కళాశాలల నిర్వహణ తమకు కష్టమౌతుందని ప్రైవేటు యాజమాన్యాలు గగ్గోలు పెట్టాయి. ప్రభుత్వం చెల్లించటం లేదు గనుక ఫీజులు చెల్లించవలసినదిగా విద్యార్థులపై వత్తిడిని పెంచాయి. దీనితో సహజంగానే విద్యార్థుల ఆందోళన ముందుకొచ్చింది.

తమకు చెల్లించవలసిన బకాయిలలో సగమైనా ప్రభుత్వం చెల్లించకుంటే ఫిబ్రవరి 16 నుండీ తాము కళాశాలలను మూసివేయక తప్పదని యాజమాన్యాలు ప్రభుత్వాన్ని హెచ్చరించే స్థితికి చేరుకున్నాయి. రచ్చబండల పేరుతో వందలకోట్ల ప్రజాధనాన్ని ప్రకటనల రూపంలోనే దుర్వినియోగం చేసిన ప్రభుత్వం ప్రైవేటు కాలేజీలకు బకాయిలు చెల్లించి ముఖ్యంగా విద్యార్థులు తమ భవిష్యత్తు గురించి పడుతున్న ఆందోళనను తొలగించవచ్చు.

కానీ ప్రభుత్వం దీనికి సిద్ధం కాకపోవడంతో ప్రభుత్వం – ప్రైవేటు కళాశాల యాజమాన్యాల నడుమ విద్యార్థులు అడ్డకత్తెరలో పోకచెక్కలా నలిగిపోతున్నారు. రాజశేఖర్‌రెడ్డి హఠాన్మరణంతో తదనంతరం అధికారంలోకి వచ్చిన ముఖ్యమంత్రులెవ్వరూ తన తండ్రి మానస పుత్రికలైన సంక్షేమ పథకాలను కొనసాగించే చిత్తశుద్ధి లేకపోవటమే ఈ సమస్యకు కారణంగా పేర్కొంటూ జగన్ ఒకవైపు దీక్షలను చేపడుతుండగా, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీ కర్రవిరగకుండా పాము చావకుండా సన్నాయినొక్కులు నొక్కుతూ విద్యార్థుల సమస్యల పట్ల మొసలి కన్నీరు కారుస్తున్నది.

కాగా, ఇంజనీరింగ్ కళాశాలల యాజమాన్యాలు తమకు రావలసిన 5వేల కోట్ల బోధనా రుసుము బకాయిల గురించి డిమాండ్ చేయటంతో ప్రభుత్వం–ప్రైవేటు కళాశాల భవనాలు ప్రయోగశాలలు, వసతి సౌకర్యాలు దతితర సమస్యలను ఎదురు నిలిపి ప్రశ్నిస్తున్నది. ఈ పరిస్థితి వాస్తవమే అయినా, ప్రైవేటు వృత్తి, సాంకేతిక కళాశాలల ప్రమాణాలకు తగినట్లుగా వున్నాయా లేవా అనే అంశం ఈనాటి వరకూ ప్రభుత్వం ఎందుకు పరిగణనలోకి తీసుకోలేదన్నదే ప్రశ్న.

ఈ మొత్తం విషయాలను గమనంలోకి తీసుకోవటం ద్వారా, తక్షణం ప్రభుత్వం విద్యార్థుల బోధనా ఫీజులను రీఎంబర్స్ చేయటం, ఉపకార వేతనాలను చెల్లించటం ద్వారా విద్యార్థుల మానసిన

ఆందోళనను తొలగించి, వారి విద్యా సంవత్సరం సాఫీగా సాగిపోయే చర్యలను చేపట్టాలి.

2008లో ఫీజులు పెంచమని ఇంజనీరింగు కళాశాలల ప్రైవేటు యాజమాన్యాలు కోరాయి. కాలేజీ స్థాపనకు 5 కోట్లు నిర్వహణకు ఏడాడికి 2 కోట్లు ఖర్చవుతున్నదనీ, ప్రతి విద్యార్థికీ తలసరిన 40 వేలు ఖర్చవుతుందని లెక్కలు చెప్పాయి. ప్రభుత్వం ఫీజును 33 వేలకు పెంచి, మేనేజిమెంటు కోటా పెంచేందుకు అంగీకరించింది.

ప్రైవేటు యాజమాన్యాలు లెక్కలు పెంచి చూపిస్తాయన్న సంగతలా వుంచి, వారి లెక్కల ప్రకారమే చూసినా, ఇప్పటికే తిరిగి చెల్లించిన ఫీజుల మొత్తంతో ప్రభుత్వమే వృత్తి కళాశాలలన్నింటినీ నిర్మించగలిగి వుండేది. వీటి నిర్వహణకు ఏటా 2000 కోట్లు ఖర్చు పెడితే సరిపోయేది. అలాచేసి వుంటే ఈ కళాశాలల్లో చేరిన విద్యార్థులందరూ ఉచితంగా విద్యను పొంది వుండేవారు.

ఇటీవల ప్రపంచబ్యాంకు పరిశ్రమలకు అవసరమైన నిపుణకార్మికుల కొరతవున్నందున పాలిటెక్నిక్ కాలేజీల సంఖ్య పెంచమని సూచించింది. ఆ దిశగా కదిలి ప్రైవేటు పాలిటెక్నిక్‌లను ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది.

దేశ ఆర్థిక వ్యవస్థకు ఎందరు వృత్తి నిపుణులు అవసరమో దానిని బట్టి ఆశ్రితులందరికీ ప్రైవేటు కాలేజీలు మంజూరు చేశారు. వాటిలో సీట్లు నిండని స్థితి ఏర్పడటంతో ఫీజు రీఎంబర్స్‌మెంటు పథకాన్ని ప్రవేశపెట్టారు. ఉచితంగా వృతి విద్య నేర్చి ఉపాధి పొందవచ్చునని భావించి పేద వర్గాల పిల్లలు చేరారు. అయినా నాణ్యమైన విద్య అందక, విద్యానంతరం తక్కువ అవకాశాలుండటంతో పోటీకి తట్టుకోలేక నిరుద్యోగులుగానో, వచ్చిన ఉద్యోగంతోనే (అండర్ ఎంప్లాయిమెంటు) సరిపుచ్చుకుంటున్నారు. ఇది ప్రజా ద్రవ్య వనరుల వృథాయేగాక మానవ వనరుల వృథా కూడా జరిగి దేశ పురోగమనాన్ని నిరోధిస్తున్నది. అయినా ఆశ్రితవర్గానికి లాభాలు కట్టబెట్టడమే లక్ష్యంగా పనిచేస్తున్నది.

విద్యను వ్యాపారంగా చూస్తూ, లాభార్జనావసరుగా పరిగణించటంతో వృత్తి విద్యా కాలేజీలు తామర తంపరగా పెరిగాయి. ప్రవేశ పరీక్షలో అర్హత సాధించక పోయినా ఖాళీ సీట్లను నింపుకోవడానికి అనుమతించినా సీట్లు నిండని స్థితి ఏర్పడింది. దీనితో విద్యార్థులకు బ్యాంకుల ద్వారా రుణాలిప్పించే పథకాన్ని ప్రారంభించారు. అయినా సీట్లు నిండక పోవటంతో వృత్తి విద్యా కోర్సులలోని ఎస్సీ, ఎస్టీ విద్యార్థుల ఫీజు రీఎంబర్స్‌మెంటు పథకాన్ని ప్రవేశపెట్టింది. దీనిని రాష్ట్రంలోని బిసిలకూ, ఈ బిసిలకూ విస్తరించింది.

అయినా ఇప్పటికీ అనేక కాలేజీల్లో సీట్లు ఖాళీగానే వుంటున్నాయి. తూర్పు గోదావరి జిల్లాలో మూడు ఇంజనీరింగ్ కాలేజిల్లో ఒక్క విద్యార్థి కూడా లేదు.

ఈ ప్రైవేటు కాలేజీలను రక్షించేందుకు ప్రభుత్వం ఈ పథకాల్ని ప్రవేశపెట్టింది. ప్రభుత్వ అస్పత్రులను కునారిల్లజేసి ప్రైవేటు, కార్పోరేటు అస్పత్రులకు ఆదాయం సమకూర్చిన ఆరోగ్య శ్రీ పథకం లాగనే, ఫీజు రీఎంబర్స్‌మెంటు కూడా వృత్తి కళాశాలల యాజమాన్యాలకు ఊపిరి అందించింది.

సీట్లు ఖాళీగా వుంటున్నందున కొన్ని కాలేజీలు మూతవేసే ఉద్దేశంతోనే ఫీజుల చెల్లింపును ఆలశ్యం చేస్తున్నది. ఎస్సీ, ఎస్టీల ఫీజులకు నిధులు కేంద్రం నుండి వస్తున్నాయి. వచ్చిన వాటిని వచ్చినట్లు ఇచ్చినా యాజమాన్యాలు గొడవకు దిగి వుండేవి కావు. ఇప్పుడు ఎవరిమీద వేటు పడుతుందోనని ఆందోళనకు దిగాయి.

అవసరం లేకపోయినా, గౌరవ ప్రద ఉపాధి దొరికే అవకాశం లేకపోయినా ప్రైవేటు కాలేజీలను ప్రోత్సహించి విద్యార్థుల జీవితాలతో చెలగాటమాడటమే కాక, ఆ చదువులు కూడా సక్రమంగా సాగించుకోలేని ఉద్రిక్త వాతావరణాన్ని సృష్టిస్తున్నారు.





# దళితులపై పెరుగుతున్న దాడులు

- ఏ.రాజు

ఈ జనవరి 26తో భారత రాజ్యాంగానికి 61 వసంతాలు నిండాయి. అస్పృశ్యతను నిషేదిస్తూ రాజ్యాంగం చట్టం చేసి అర్థశతాబ్ది పైగానే కాలం గడిచిపోయింది. సామాజికంగా వెనుకబడిన వర్గాలు-షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల ప్రజలను అభివృద్ధి పథంలో ముందుకు తీసుకెళ్ళేందుకు తామెన్నో పథకాలను రూపొందించి అమలు చేస్తున్నామని పాలకులు చెప్తూనే వస్తున్నారు. శాస్త్ర సాంకేతిక రంగంలో అద్భుతమైన ప్రయోగాలు చేస్తూ, అనూహ్య ప్రగతిని సాధిస్తూ 21వ శతాబ్దంలో మనదేశం అధునీకరణ దిశగా శరవేగంగా సాగిపోతున్నదని జబ్బలు చరుచుకుంటూ వున్నారు. వీరి కల్లబొల్లి కబుర్లని ప్రక్కన పెడితే వాస్తవ అర్థంలో సామాజికంగా వెనుకబడిన దళితులు, ఆదీవాసీల పరిస్థితి 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' అన్న విధంగా వుంది. పాలకులు పెద్ద ఎత్తున వూదరగొడుతున్న సామాజిక సంక్షేమ పథకాలు, రిజర్వేషన్స్ వంటి రాజ్యాంగంలో కల్పించిన అవకాశాలు మరియు గౌరవ ప్రదమైన జీవితాన్ని దళితులకు గ్యారంటీ చేస్తామనే రాజ్యంగ, చట్టహామీలు వంటి వాటి డొల్లతనమేమిటో దళితుపై అనునిత్య దేశవ్యాపితంగా సాగుతున్న అత్యాచారాలు, దౌర్జన్యాలు, దాడులను పరిశీలిస్తే తేటతెల్లమౌతుంది.

సామాజికంగా, ఆర్థికంగా ఆధిపత్యం చెలాయిస్తున్న అగ్రకులాల చేతుల్లో దళితులు - సామాజిక, ఆర్థిక అణచివేతలను ఈనాటికి ఎదుర్కొంటువున్నారు. వారు ఈనాటికీ అనేక అత్యాచారాలకు, దౌర్జన్యాలకు, వేధింపులకు గురౌతూనేవున్నారు. దళితులపై జరుగుతున్న అనేక దారుణ సంఘటనల్లో వారు పలుచోట్ల ప్రాణాలు కోల్పోతున్నారు. అస్థుల ధ్వంసం జరుగుతుంది. వున్న ఎకరా, అర ఎకరా భూములు లాగివేసుకోబడుతున్నాయి. ఈ విధమైన హింసకు దళితులు ఎదుర్కొంటూవుంటే వీటిని అరికట్టి రక్షణ కల్పించవలసిన పోలీసు యంత్రాంగం ప్రేక్షకపాత్ర వహించటమేగాక, ఎవరైతే దళితులను అణచివేతకు హింసకు గురిచేస్తున్నారో వారి కొమ్ముగాసే వైఖరితో వ్యవహరిస్తున్నది.

మన దేశ అర్థ-ఫ్యూడల్ వ్యవస్థలో ప్రధానంగా దళితులపై సాగుతున్న దాడులు, దౌర్జన్యాలు ఎక్కువభాగం భూమి సంబంధమైన అంశాలుగానే వున్నాయి. దళితులలో ఎక్కవ భాగం భూమిలేని నిరుపేదలుగానే వున్నారు. ఎకరా, అర ఎకరా ఉన్న దళితుల భూములు కూడా నయాన్నో, భయాన్నో గుంజివేసుకోబడుతూ వారంతా భూమి హీనులుగా, వ్యవసాయకూలీలుగా జీవనం సాగిస్తూ భూయజమానులైన పెత్తందారుల,భూస్వాముల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి జీవిస్తూ వస్తున్నారు. దళితులలో ఎక్కువభాగం నిరక్షరాస్యులుగా వుండటం, తీవ్రమైన పేదరికంతో నిరంతరం బాధపడుతూండటం అనే అంశాలు వారిపై దోపిడీని తీవ్రంచేయడానికి మరింత దోహదపడే అంశాలుగా వున్నాయి. ఎస్సీ, ఎస్టీ అత్యాచారాల నిరోధక చట్టం-1989, తదితర చట్టాలను కూడా సక్రమంగా వినియోగించకపోవటం ఈ దాడుల దౌర్జన్యాల తీవ్రత పెరిగిపోవటానికి కారణంగా వుంది.

ఈ క్రింద పేర్కొంటున్న కొన్ని ఘటనలు దళితుల సమస్యల తీవ్రతను ఎత్తిచూపడానికి, ఈ సమస్యతో ముడిపడివున్న వివిధ అంశాలను తెలుసుకొనేందుకు దోహదపడతాయి.

2010 ఫిబ్రవరి 18న ఒరిస్సా రాష్ట్రం, కేంద్రపాడ జిల్లా జెనాసాషి గ్రామంలో అగ్రకులాలకు చెందిన వారు దళితుల ఇండ్లపై దాడికి పాల్పడ్డారు. ఈ దాడిలో 23 మంది దళితులు గాయపడగా, 33 ఇళ్ళు ధ్వంసంకాగా ఇతర చిన్నపాటి ఆస్తులకు కూడా తీవ్ర నష్టం జరిగింది. ఇంకా దాడులు జరుగుతాయనే భయంతో ఆ దళితులు తమ ఇళ్ళను వదిలి సమీప గ్రామాలకు పారిపోయారు. ఆ గ్రామంలో ఒక గుడిని కట్టదలచి,దానికి అవసరమైన మట్టిని ఆ గ్రామంలోని దళితేతర అగ్రకులాల వాళ్ళ (దళితులు సాగుచేసుకుంటున్న) బంజరు పొలంలో మట్టి తవ్వితీసుకెళ్ళేందుకు సిద్ధమయ్యారు. ఈ చర్యను దళితులందరూ వ్యతిరేకించారు. ఇది వారికి తీవ్ర అగ్రహం తెప్పించి, ఈ దుర్మార్గమైన దాడులకు తెగబడ్డారు.

2010 ఫిబ్రవరి 18న ఉత్తరప్రదేశ్‌లోని సుల్తాన్ పూర్‌జిల్లా ముస్తాఫిరిఖానాలోని అలీగంజ్ ప్రాంతంలో ఒక ఎ.ఎస్.ఐ తన కస్టడీలో వున్న ఒక మహిళపై చేయిచేసుకున్నాడు. అమె తన నేరాన్ని అంగీకరిస్తున్నప్పటికీ ఈ చర్యకు పాల్పడ్డాడు. ఇది వెల్లడవటంతో ఉన్నతాధికారులు అతనిని విధులనుండి తప్పించారు.

2010 ఫిబ్రవరి 21న ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోనే ఖానాపూర్ జిల్లా తాజ్‌పూర్ పట్టణంలో 25 సంవత్సరాల ఒక దళిత మహిళను ఒక గుంపు నిలువునా తగులబెట్టే ప్రయత్నం చేశారు. ఆ దళిత మహిళ మార్కెట్‌కు వెళ్తుండగా ఆ దుండగుల గుంపు ఆమెను వేధింపులకు గురిచేసింది. ఆవె ఈ చర్యలను ప్రతిఘటించినందుకుగాను ఆ దుండగులు ఆమెపై కిరోసిన్‌పోసి నిప్పంటించారు. చుట్టుప్రక్కల మరికొందరు కలుగజేసుకొని మంటలను ఆర్పి ఆమెను రక్షించారు.

హర్యానా రాష్ట్రం, హిసార్ జిల్లా మిర్చీపూర్ గ్రామంలో ఏప్రిల్ 21వ తేదీన అగ్రకులాలకు చెందిన వారు ఇళ్ళపై దాడులు చేశారు. ఈ దాడుల్లో అంగవికలురాలైన ఒక బాలిక, వృద్ధుడైన ఆమె తండ్రి మరణించారు. ఈ సంఘటన నయబ్ తహశీల్దారు, మరియు పోలీసు అధికారుల సమక్షంలోనే జరిగింది. ఈ సంఘటన సిగ్గు పడవలసిన విషయంగా కాంగ్రెస్ పార్టీ అధ్యక్షురాలు సోనియాగాంధీ పేర్కొంది. కాగా, హర్యానా రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీనే అధికారంలో కొనసాగుతున్నది. ఇంకా దాడుల కొనసాగుతాయనే భయంతో 153 దళిత కుటుంబాలకు చెందినవారు మిర్చిపూర్ గ్రామం నుండి సమీప గ్రామాలు వలసవెళ్ళారు.

హర్యానా రాష్ట్రంలోనే కర్నాల్ జిల్లా, నిర్సాంగ్ ప్రాంతంలో బాజీదరోదన్ గ్రామంలో అగ్రకులాల దుర్మార్గమైన దాడిలో దళిత కుటుంబాలవారు ఆరుగురు తీవ్రంగా గాయపడ్డారు. తిరిగి జూన్ 19న హర్యానాలోని ఝుజర్ జిల్లాలోని గ్వాలిసన్ గ్రామంలో జాట్ కులానికి చెందిన యువకులు, ఒక మొబైల్ ఫోన్‌ను దొంగిలించినట్లుగా అంగీకరించనందుకుగాను సందీప్ కుమార్‌పై ఒక క్యాన్ పెట్రోల్‌ను కుమ్మరించారు. దీనిలో కులపరమైన అంశమేమి లేదని పోలీసులు ప్రకటిస్తూ కేసును నీరుగార్చేందుకు పూనుకున్నారు. తిరిగి ఇదే రాష్ట్రం సోనాపేట జిల్లా బరోనా గ్రామంలో ఇటీవలే ముగిసిన గ్రామపంచాయితీ ఎన్నికల్లో తాము నిర్ణయించిన అభ్యర్థికి ఓటు వేయలేదనే కారణంతో ఆ గ్రామంలోని అగ్రకుల పెత్తందార్లు దళితుల ఇళ్ళను నాలుగింటిని ధ్వంసం చేశారు.

మధ్యప్రదేశ్‌లోని శివపురి జిల్లా సిర్సోనా జిల్లాలో మే 30వ తేదీన తనకు రావలసిన కూలీ తాలూకూ నాలుగువేల రూపాయల బకాయిని అడిగినందుకుగానూ రమేష్ జాదవ్ అనే దళితుడిని, భూయజమాని నిర్దాక్షిణ్యంగా హత్యచేశాడు. తన బకాయిలను అడగటం సహించలేని భూయజమాని తన గుండాలనుపయోగించి తలపై రాళ్ళతో మోది దారుణంగా హత్యచేశాడు.

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రకాశంజిల్లా అద్దంకి మండలం కునుకుపాడు గ్రామంలోని అగ్రకుల పెత్తందార్లు దళితులను ప్రధానగ్రామ కూడలివైపు రాకుండాను, వారికి ఆ గ్రామ అంగళ్ళలో పాలతో సహా కనీస ఆహార సరకులను కూడా అమ్మకుండా నిరోధించారు. సాంఘిక బహిష్కరణ చేశారు. దీనిని దళితులు ప్రశ్నిస్తే అగ్రకుల పెత్తందార్లు తమ ట్రాక్టర్లతో తొక్కించి చంపేస్తామని లేదా వారి ఇళ్ళను ధ్వంసం చేస్తామని బెదిరించారు. గ్రామంలోని ఒక సిగరెట్ షాపు వద్ద, సిగరెట్ కొనుగోలు చేసేవద్ద అగ్రకులానికి చెందిన ఆ దుకాణాదారుడికి, మాజీ దళిత సర్పంచికి మధ్య జరిగిన వాగ్వివాదమే ఈ సాంఘిక బహిష్కరణకు కారణం! జిల్లా అధికారులు ఆ గ్రామ పెద్దలకు నచ్చజెప్పేందుకు ప్రయత్నం చేశారేగాని, దళితులను సామాజిక బహిష్కరణ చేసినందుకుగానూ గ్రామస్థులపై ఏ విధమైన చర్యలూ చేపట్టేందుకు సిద్ధంకాలేదు.

జూన్ 28న మన రాష్ట్రంలోనే కర్నూల్ జిల్లా, ఆదోని మండలం సలకలకొండ గ్రామంలో దళితకులానికి చెందిన డప్పుకొట్టే అతను ఒక ఫ్యాక్షన్ నాయకుని చేతిలో హత్యకు గురయ్యాడు. ఏరువాకసాగే సమయంలో ప్రత్యర్థి వర్గానికి చెందిన ఫ్యాక్షన్ నాయకుని వూరేగింపులో ఈ దళితుడు డప్పుకొట్టటమే అతను చేసిన నేరం! ఆ దళితవాడలోని పలు ఇండ్లపై ఫ్యాక్షన్ నాయకుని అనుచరులు దాడుచేసి అంతిమంగా బంగారయ్య అనే ఆ డప్పుకళాకారుడిని ఇనుపరాడ్లతో కొట్టి చంపారు. అడ్డుబోయిన పలువురిని తీవ్రంగా గాయపరిచారు.

ముంబయి నగరంలో జూన్ 26న కవిత అనే ఒక దళిత మహిళను అగ్రకుల దుండగులు కొందరు అసభ్యమాటలతో వేధించారు. అంతేగాక ఆమె దుస్తులను లాగివేస్తూ కొట్టారు. ఇదంతా బహిరంగంగా జరిగింది. అడ్డుబోయిన ఆమె తల్లినీ కొట్టారు. ఇదంతా చూస్తున్న కొందరు తమ మొబైల్ ఫోన్లద్వారా దీనినంతా చిత్రికరించారు కూడా. దీనంతటికి కారణం- అగ్రకుల ఆధిక్యం వున్న ప్రాంతంలోని కుళాయి నీటిని ఈ దళిత మహిళ ఉపయోగించుకోవటమే గాకుండా, ఆ అగ్రకులాల వారు ఆ నీటిని ఈ మహిళ ఉపయోగించుకొన్నందుకుగాను కొంత డబ్బు కట్టాలని డిమాండ్ చేసినా దానిని నిరాకరించటమే! ఈ సంఘటన ప్రక్కకు మళ్ళించేందుకు తిరిగి కవిత సోదరుడిపైనే అక్రమంగా ఒక రేప్‌కేసును బనాయించారు కూడా! సమీపంలో వున్న ఒక ముస్లీం కుటుంబం ఆమె కప్పుకోవటానిక ఒక దుపట్టాను ఇచ్చి కవితను ఆదుకున్నారు.

కర్ణాటక రాష్ట్రం తుముక్కురు గ్రామంలో జులై ఒకటిన హోన్నమ్మ అనే ఒక దళిత మహిళను అగ్రకులాల పెత్తందారులు రాళ్ళతో కొట్టి చంపేశారు. గతంలో హోన్నమ్మ స్థానిక ఎన్నికల్లో రెండుసార్లు పోటీచేసి ఓడిపోయింది. ఆమె పోటీ చేయడం వలన తాము నష్టపోతున్నామనే దానిని మనసులో పెట్టుకొని బయటకు ఒక ప్రాధాన్యతలేని విషయంపై గొడవ పెట్టుకుని నిర్దాక్షిణ్యంగా రాళ్ళు విసిరి హత్యచేశారు.

కాబట్టి ఏ విధమైన కారణంతోనైనా దళితులను లక్ష్యంగా ఎంచి వారిపై క్రూరమైన హింసను ప్రయోగించటమనేది సాగుతూ వస్తున్నది. అధికారంలో కొనసాగుతున్న పాలకులందరూ ఓట్లు రాబట్టుకునేందుకు దళితులను ఒక సాధనంగా వినియోగించుకొని అధికారపీఠాన్ని అధిరోహించటం మినహా దళితుల ప్రయోజనాలను పరిరక్షించటాన్ని పూర్తిగా ప్రక్కన పెట్టారు. దళితులపై సాగుతున్న

అత్యాచారాల పరంపరల సందర్భంగా అత్యాచారానికి కారకులైన అగ్రకులాల, పెత్తందార్ల పక్షం వహిస్తూ వస్తున్నారు. పోలీసు అధికారులు, చట్టాన్ని అమలు చేయవలసిన యంత్రాంగం కూడా సామాజికంగా ఆర్థికంగా బలీయమైన అగ్రకుల పెత్తందారుల, భూస్వాముల పక్షం వహిస్తున్నారు. చివరికి న్యాయస్థానాలు కూడా దళితులపై అత్యాచార, దాడులకేసులు అనేకవాటిల్లో, 'కుల' కోణం లేదని నిరాకరిస్తూ దళితులకు అన్యాయం చేస్తున్నాయి. ఎస్సీ, ఎస్టీ, కమీషన్ ఛైర్మన్ ప్రకటన ప్రకారం ఉత్తరప్రదేశ్, బీహర్, మధ్యప్రదేశ్, పంజాబ్, హర్యానా, గుజరాత్ మరియు తమిళనాడు రాష్ట్రాలు దళితులపై అత్యాచారాల విషయంలో అగ్రగామిగా వున్నాయి. అయినప్పటికీ, దేశంలోని మిగతా రాష్ట్రాలు ఈ విషయంలో ఏమాత్రం తీసిపోవని మనకు అర్థమౌతున్నది.

దళిత మహిలపై అత్యాచారాలు అదేవిధంగా భూమి సంబంధమైన దళితులపై దాడులు దేశవ్యాపితంగా పెరుగుతుండటాన్ని గమనించగలం. చనిపోయేవరకు రాళ్ళతో కొట్టడం, దళిత మహిళలను నగ్నంగా వీధుల్లో తిప్పటం, దళితుల ఇళ్ళను, ఆస్తులను తగులబెట్టడం, దళిత కుటుంబాలను లేదా దళిత వాడలను సాంఘిక బహిష్కరణకు గురిచేయటం వంటివన్నీ పెరుగుతూ వస్తున్నాయి. ఏ పార్టీ ప్రభుత్వం కేంద్రంలోనూ లేదా రాష్ట్రాలలోనూ వున్నప్పటికీ దళితులపై అత్యాచారాలు అవిచ్ఛినంగా సాగుతున్నాయి. ఈ విధంగా 63 సంవత్సరాల స్వతంత్రమనబడే దాని తర్వాత కూడా దళితులు కనీస హక్కులు కాదు కదా, తీవ్రమైన వివక్షకు, అణచివేతకు గురౌతూవస్తున్నారు.

మన సమాజంలో సాగుతున్న ఈ అమానవీయ, క్రూరమైన పరిస్థితులకు ప్రస్తుత అర్థఫ్యూడల్ వ్యవస్థలోని సామాజిక, ఆర్థిక, రాజకీయ కారణాలే ప్రధానమైనవి; మూలమైనవి. ఈ దోపిడీ వ్యవస్థను సమూలంగా పెకిలించనంతవరకూ ఎన్ని ప్రజారక్షక పథకాలు, సంక్షేమ పథకాలు రూపొందించినా, అమలుచేసినా నిజమైన అర్థంలో జీవించేహక్కు, ఆత్మగౌరవంతో దళితులు తలఎత్తుకునే హక్కు లభించవు.

*(వ్యాసకర్త: చరిత్ర పరిశోధక విద్యార్థి)*

# ఆత్మ బలిదానాలు కాదు పోరాడి గెలవడమే భగత్‌సింగ్‌కు నివాళి

-ఆవుల అశోక్

తెలంగాణ రాదేమోనని శ్రీకాంత్‌చారి అగ్నిని ముద్దాడినాడు. వేణుగోపాల్ రెడ్డి ఉస్మానియా గడ్డమీద మండాడు. తెలంగాణ రాష్ట్రం సాధించి తీరాలని యాదయ్య ఆత్మహుతి అయ్యాడు. కానిస్టేబుల్ కృష్ణయ్య సర్వీస్ రివాల్వర్‌తో కాల్చుకొని తనువు చాలించాడు. మరి కొందరు ఉరివేసుకోగా, ఇంకొందరు రైలు క్రింద పడి నిండు ప్రాణాలు వదిలారు. ఇలా ఎందరో... బలౌతూనే ఉన్నారు. వారి ఆకాంక్షను అర్థం చేసుకోగలం. కానీ ఆత్మహత్యలను అంగీకరించలేము. ఈ మధ్య కాలంలో అనేక సందర్భాలలో అత్మహత్య కూడా నిరసనలో భాగమై కూర్చుంది. ఆత్మహత్యల ద్వారా తమ డిమాండ్స్ సాధించగలం అనుకోవడం బలహీనతకు నిదర్శనం.

ప్రాణాలు తీసుకోవడం పిరికి చర్యగా షహీద్ భగత్ సింగ్ అభివర్ణించాడు. తన సహచరుడు సుఖదేవ్ తమ ఉరిశిక్షను ప్రజల వత్తిడి వల్ల యావజ్జీవ శిక్షగా మారిస్తే, జైళ్ళో మగ్గడం కన్నా ఆత్మహత్మ మెరుగని రాసిన ఉత్తరానికి జవాబుగా పోరాడి సాధించాలి తప్ప తనువు ఛాలించడం ఏ పరిస్థితులలో సమర్థనీయం కాదని వివరిస్తాడు. ఉద్యమంలో కష్టాలు భరించడం కూడా దేశ సేవే అవుతుంది అంటాడు. ఆత్మహత్య ఒక అసహ్యకరమైన నేరంగా ఖండిస్తాడు. మనమే కాదు మామూలు మనిషి అయినా కూడా అలా చేయకూడదంటాడు. చావుకు సిద్దమవ్వడం అంటే అత్మహత్యకు పాల్పడుతున్నామన్న భావం కాదని సుఖదేవ్‌కు జవాబు వ్రాసాడు. ప్రజల హృదయాలలో ఉద్యమకారుల చావు. చెరగని ముద్ర వేయాలే తప్ప జాలీ కలుగకూడదని భగత్‌సింగ్ హెచ్చరిస్తాడు.

ఆధునికి భారత యువతరానికి భగత్‌సింగ్ ఆదర్శంగా నేటికి ఉన్నాడు. ఒక జాతి మరొక జాతిని, ఒక వ్యక్తి మరొక వ్యక్తిని దోపిడి చేయని సమాజం కోసం భగత్‌సింగ్, రాజగుర్, సుఖదేవ్ చేసిన త్యాగాలు ప్రజల హృదయాలలో నిలిచి పోయాయి. వారి రాజకీయ జీవితం రెండున్నర సంవత్సరాలు అయినా స్వాతంత్ర్య ఉద్యమాన్ని ఉజ్వల స్థాయికి తీసుకువచ్చారు యువకులను కూడగట్టడంలో వారి కృషి అమోఘమైనది. పార్లమెంట్‌లో బాంబు దాడి, లాలాలజపతిరాయ్ మృతికి ప్రతికారంగా బ్రిటీష్ అధికారి సాండర్స్ హత్య లాంటి సంఘటనలు స్వాతంత్ర్య ఉద్యమానికి సమరశీలతను ప్రసాదించాయి. స్వాతంత్ర్య పోరాటాలలో ఈ చిరస్మరణీయులను చంపిన ఘోరాతి ఘోరంగా మరే ఉద్యమంలో చంపలేదు. 1931 మార్చి 23 ఉదయాన్నే ఉరితీసి ఈ వేగుచుక్కను సట్లేజ్ నది తీరంలో మాంసం ముద్దలుగా మార్చి, పెట్రోల్‌తో దగ్ధం చేసి, కాలుతున్న మాంసం ముద్దను నదిలో విసిరివేసినది కర్కష బ్రిటీష్ ప్రభుత్వం. అదే తీరుగా తెలంగాణ గాన కోకిల బెల్లి లలితను చంపి, శరీరాన్ని 17 ముక్కలుగా నరికి బావిలో పడేశారు. అధునిక పాలకులు. నైజాం పాలనపై సాగిన వీర తెలంగాణ విప్లవ సాయుధ పోరాటంలో వేల మంది అతి సామాన్య రైలు కూలీలు రక్తం ధారపోశారు. 1969 తెలంగాణ ఉద్యమంలో ప్రభుత్వ దమనకాండలో నాలుగు వందల మంది విద్యార్థి రత్నాలు రాలి పోయాయి. అంతేకాదు, ఆరు దశాబ్దాల కాలంలో తెలంగాణ గుండెలు పగలని రోజు ఎప్పుడు లేదు. తెలంగాణ ఉద్యమ బాలుగు భారసాలలనాడే చెరసాలలను అనుభవించాడు. పాల బుగ్గల నాడే తుటాలను అరగించింద్రు, కత్తుల వంతెన మీద కవాతుల కబడ్డీ ఆడుతున్న ఘన చరిత్ర తెలంగాణ ఉద్యమానికి ఉంది. ద్రోహ, విద్రోహాల నడుమ తెలంగాణ పురుడు పోసుకుంటూనే వుంది. పోరు బిడ్డలను కంటూనే వుంది. తప్ప ఆత్మహత్యలు చేసుకున్న చరిత్ర లేదు.

రాజకీయ పార్టీలు తెలంగాణ అంశాన్ని రాజకీయ చదరంగం ఆడుతున్నారు. నాలుగు కోట్ల ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షను పట్టించుకోవడంలేదు. అన్ని వర్గాల ప్రజలు పల్లె నుండి పట్టణం వరకు గత 15 మాసాలుగా రోడెక్కారు. కానీ, కేంద్రం కేసీఆర్ దీక్షతో వచ్చిన ఉద్యమం అని, చిదంబరం ప్రకటనతో చల్లారి పోతుందని అనుకుంది. దోపిడి, వివక్షతల మీద ప్రారంభమైన ఉద్యమం తెలంగాణ ప్రక్రియ ప్రారంభం అయ్యేంత వరకు కొనసాగుతుందన్న వాస్తవం గుర్తించదలుచుకోలేదు. తెలంగాణకు మద్దతుగా రాజీనామాలు చేస్తామన్న కాంగ్రేస్ వారు శ్రీకృష్ణ కమీషన్ పేరుతో దాటవేయగా, కాంగ్రేస్‌ను అడ్డం పెట్టుకొని తెలుగుదేశం ద్వంద్వ వైఖరిని ప్రదర్శిస్తూ, తెలంగాణ కంటే వారి రాజకీయ లబ్దికే ప్రాధాన్యత ఇస్తున్నారు. పార్టీల ద్వంద్వ వైఖరుల మూలంగానే తెలంగాణలో ఆత్మహత్యల వరంవర కొనసాగుతున్నాయి. ముమ్మాటికీ ఇది కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల హత్యలే. ఈ ఆత్మహత్మలు విడనాడి భగత్‌సింగ్ ఆచరించి చూపిన మార్గం వైపు మల్లాలి. ఇలా ఆత్మ బలిదానాలు సరికాదన్న విషయాన్ని తెలంగాణ విద్యార్థి, యువత అర్థం చేసుకోవాలి. భగత్‌సింగ్‌లో ఉన్న సాహసం, త్యాగం, రాజకీయ స్పష్టత, ధీరోదత్తత,

*Contd... 40*

# దళితుల తొలి విప్లవ పోరాట దినాన్ని స్మరించుకుందాం

1927 మార్చి 20వ తేదీ. అది దళితులు విప్లవానికి శంఖారావం పూరించిన దినం. భారతదేశపు జాతీయ జీవితంలోనూ, సాంఘిక జీవితంలోనూ ఒక కొత్త అధ్యాయానికి తెరలేపిన దినం. దళిత సమాజం మొట్టమొదటి సారిగా వాస్తవమైన ఆందోళనలో పాల్గొన్న దినం. ఒక అస్పృశ్యుడి నాయకత్వంలో తరతరాలుగా తమను అంటరానివారిగా చూస్తూ, సాటి మానవుని కంటే హీనంగా చూస్తున్న మనువాద సమాజానికి సమాధి కట్టేందుకు అంకురార్పన చేపట్టిన దినం. అదే తొలి దళిత విప్లవ పోరాటానికి నాంది. "చవ్‌దార్ చెరువులో" (మహాడ్ చెరువు) నీళ్ళు తాగి తతిమ్మా జనం లాగే దళితులు మనుషులే అని చాటి చెబుతూ డా॥ బి.ఆర్ అంబేద్కర్ నాయకత్వాన సమానత్వానికై జరిగిన పోరాటానికి ప్రారంభ సూచిక అయిన చవ్‌దార్ చెరువు ఘటన జరిగి ఈ మార్చి 20 నాటికి 88 సంవత్సరాలు గడుస్తూంది. ఈ సందర్భంగా ఈ ఘటనను స్మరించుకోవాల్సిన బాధ్యత మనందరిది.

డా॥బి. ఆర్. అంబేద్కర్ అప్పటి వరకు అస్పృశ్య సమాజంలో ఆత్మాభిమానాన్ని, వ్యక్తిత్వాన్ని మేలుకొల్పడానికి ప్రయత్నిస్తూ వచ్చాడు. దళిత సమాజంతో ఆత్మగౌరవం కలిగేటట్లు చూశాడు. మానసికంగా అస్పృశ్య సమాజం ఎంత ముందుకు వెళ్ళిందో అంచనా వేసుకున్నాడు. అస్పృశ్యుల గుండెల్లో ఆత్మగౌరవాన్ని, ఆత్మాభిమానాన్ని అయితే నాటగలిగాడు కాని వస్తాదుకు పోటీలో దిగేంతవరకూ తన శక్తి మీద తనకు నమ్మకం కుదరదు, తన బలాన్ని శత్రు సైనిక బలంతో పోల్చి అంచనా వేయడం కుదరదు. అట్లాగే ప్రయత్న పూర్వకంగా పోరాటంలోకి దిగిన తర్వాతే అస్పృశ్య సమాజానికి ఉన్న శక్తి ఎంత అనేది పరీక్షించడానికి వీలు కలుగుతుంది. డాక్టర్ అంబేద్కర్‌కు కూడా ఇదే భావం కలిగింది. అస్పృశ్య సమాజం తన శక్తి సామర్థ్యాలను నిరుపించుకునేందుకు సమయం ఆసన్నమైంది, దానికి మూహుర్తాన్ని మార్చి 20న నిర్ణయించారు. నిచ్చనమెట్ల కుల సమాజంలో మూడువేల సంవత్సరాలుగా పంచమ కులంగా అగ్రవర్ణ సమాజంచే చీదరించబడుతూ, మంచినీటి చెరువులకు, నదులకు, ఆస్పత్రులకు, విద్యాసంస్థలకు, కోర్టులకు, దేవాలయాలు లాంటి సార్వజనిన స్థలాలన్నింటికి దూరంగా ఉంచిన మనుధర్మాన్ని ధిక్కరించడానికి పూనుకున్నాడు. దీనికి వేదికగా మహాడ్‌ను ఎన్నుకున్నాడు. దీనికి కారణం మహాడ్ ఆయనకు బాగా తెలిసిన ప్రాంతం. సైనిక ఉద్యోగాల నుంచి పెన్షన్ పుచ్చుకున్న మహార్ జాతికి చెందిన జనం మహాడ్‌లోనే నివాసాలు ఏర్పరచుకున్నారు. అంతేకాకుండా అక్కడ నివశిస్తున్న వారిలో చాలామందికి సాంఘీక కార్యకలాపాల గురించి అవగాహన ఉంది. వీళ్ళందరూ అవసరం వచ్చినప్పుడు జాతికోసం తమ ప్రాణాలని సైతం ఫణంగా పెట్టడానికి సిద్ధపడతారనే నమ్మకం బాబాసాహెబ్‌కు ఉంది. అంతేకాకుండా వాళ్ళందరూ సైన్యం నుంచి రిటైర్ అయి వచ్చిన వాళ్ళవడం చేత క్రమశిక్షణ వాళ్ళ రక్తంలో ఉంది.

అనుకున్నట్టుగానే మార్చి 19వ తేదిన మహాడ్‌లో పరిషత్‌ను ప్రారంభించడానికి నిర్ణయించారు. దీనిలో పాల్గోనడానికి గుజరాత్, మహారాష్ట్రకి చెందిన పల్లెలనుండి సుమారు ఐదువేల మంది జనం వచ్చారు. సాయంత్రం పరిషత్ ప్రారంభమైంది. ఈ సందర్భంగా చేయబోయే కార్యాన్ని గురించి బాబసాహెబ్ ప్రారంభ సూచకంగా ఉత్సాహపూరితమైన ప్రసంగాన్ని ఇచ్చాడు. ఈ ప్రసంగంలో మూడు సూత్రాలను చేపట్టమని బాబాసాహెబు పిలుపిచ్చాడు. అవి 1. చనిపోయిన జంతువుల మాంసాన్ని తినడం మానెయ్యండి. 2. ఎంగిలి భోజనాన్ని స్వీకరించకండి. 3. పెద్దా, చిన్నా అన్న ఊహని మనస్సులోంచి తీసేసి ఉన్నత వర్గాల జీవన విధానాలని స్వీకరించండి. అస్పృశ్య వర్గం వ్యవసాయాన్ని కూడా వృత్తిగా చేపట్టండి అని సలహా ఇచ్చాడు. దళితుల ఆత్మగౌరవాన్ని మేలుకొలిపేటట్లు ఆయన ఉపన్యసించాడు. ఈ ఉపన్యాసం ఆయన కోరుకున్న ప్రభావాన్ని జనంలో కలిగించింది. మహాడ్ చెరువు విషయంలో ఆ సమయంలోనే మహాడ్ మున్సిపాలిటీ ఒక తీర్మానం చేసింది. " ఈ చెరువు సార్వజనీకమైనదని దీని నీటిని అస్పృశ్యులతో పాటు జనం యావన్మందీ వాడుకోవచ్చుని" ఈ తీర్మానం సారాంశం. ఈ తీర్మానం బాబాసాహెబ్‌కు పోరాటానికి మార్గాన్ని సులభతరం చేసినట్టయింది. రెండవరోజు మార్చి 20వ తేదిన ఉదయం తొమ్మిది గంటలకు సమావేశం మొదలయ్యింది. ముందస్తుగా మహాడ్ మున్సిపాలిటి చేసిన తీర్మానాన్ని అమోదించారు. ఈ తీర్మానాన్ని వెంటనే అమలు పెట్టాలనే లక్ష్యంతో బాబాసాహెబు ముందు నడవగా ఐదువేల మంది దళిత సమాజం ఊరేగింపుగా,

ఉత్సాహంగా పాటలు పాడుతూ చవ్‌దార్ చెరువు గట్టుకు చేరుకున్నారు. బాబాసాహెబ్, ఆ తర్వాత దళిత సమాజం అంతా తరతరాలుగా తమ జాతికి దూరంగా ఉంచబడిన మంచి నీటిని దోసిట్లోకి తీసుకుని తృప్తిగా తాగి మనుధర్మాన్ని ధిక్కరించారు. ఒక పౌరుడిగా, మనిషిగా, మా హక్కుగా మేము తాగుతున్నాం అని మంచినీటిని తాగి తమ హక్కుని ఋజువు చేశారు.

నీళ్ళు తాగిన వారందరి మొహాల్లోనూ వింతైన ఉత్సాహం, సంతోషం తాండవించాయి. ఈ ఉత్సాహంలో బాబాసాహెబ్

నాయకత్వంలో దేన్నయిన సాధించవచ్చనే నమ్మకం ఏర్పరచుకున్నారు. ఒక్కొక్కరుగా నీటిని త్రాగిన జనం జట్లుజట్లుగా విడిపోయి తిరిగి సభాస్థలికి చేరుకున్నారు. తరతరాలుగా తాము పవిత్రంగా భావిస్తున్న మనుధర్మానికి ఈ ఘటనతో పగుళ్ళు ఏర్పడ్డాయని భావించిన సనాతనులు దళితులను ఎదురుదెబ్బ తియడానికి రహస్య మంతనాలు మొదలెట్టారు. మతం విపత్తులో పడిందని సర్వత్రా ప్రచారం నిర్వహించారు. తమతమ ప్రాంతాలకు తిరిగి వెళ్ళడానికి సిద్ధపడుతున్న దళితులపై అకస్మాత్తుగా సనాతన గుండాలు దండెత్తి వచ్చి లాఠీల వర్షం కురిపించారు. ఊరంతా తిరుగుతూ కనిపించిన ప్రతినిధులను కొట్టడం మొదలెట్టారు. ఈ వార్త బాబాసాహెబ్‌కు చేరింది. స్పృహ తప్పి పడిపోయిన జనాన్ని, దెబ్బల బాధని సహించలేక గిలగిల కొట్టుకుంటున్న ప్రతినిధులని చూసి బాబాసాహెబ్ నెత్తురు ఉడుకెత్తింది. అయిన తన కోపాన్ని అదుపులోకి తెచ్చుకొని ఎంతో గాంభీర్యంతో ఈ తరుణంలో మీరు కోపంతో ఉద్రిక్తులు కావద్దు, చెయ్యి చేసుకొవద్దు. మీరు మీ కోపాన్ని దిగమింగుకొని వారి దెబ్బలను సహిస్తూ ఈ సనాతనులకి అహింస మహత్తు ఎంతో చూపించాలి అని దళిత సమూహానికి బోధించాడు. ప్రతికారేచ్ఛతో రగిలిపోతున్న దళిత సమాజం, ఆఫ్ఘను యుద్ధంలోనూ, తదితర యుద్ధాల్లోనూ తమ పరాక్రమాన్ని, వీరత్వాన్ని ప్రదర్శించిన సైనికులు తమ కోపాన్ని దిగమింగుకొని సనాతులు కురిపిస్తున్న రాళ్ళ వర్షానికి దెబ్బలు తగిలి ఒకరి తర్వాత ఒకరు నేలవాలిపోతున్న అస్పృశ్యులు తిప్పి కొట్టలేదు. తమ నాయకుడి అదేశాన్ని శిరసావహించి సహనం ప్రదర్శించారు. ఒకవేల అస్పృశ్యులు ఎదురు దెబ్బతియ్యాలని సంకల్పించుకోని ఉంటే, దాడిచేసి ఉంటే సనాతుల ప్రాణాలను కాపాడడం ఎవరి తరం కాకపోయేది. దెబ్బలు తిన్న వారిని బాబాసాహెబ్ స్వయంగా ఆస్పత్రితో చేర్చాడు, ఈ ఘటన జరిగాక సనాతన గుండాలపై కేసులు నమోదు చేయించాడు. 1927 జూన్ 6 వ తేదిన తొమ్మిది మంది నేరస్థుల్లో ఐదుగురికి కఠిన కారగార శిక్ష పడింది. ఈ సందర్భంగా " ఈ కొట్లాట తరుణంలో హిందుయేతర అధికారులు ఉండి ఉండకపోతే విచారణ పక్షపాత రహితంగా జరగడం కష్టం అయ్యేది" అని అంబేద్కర్ అన్నారు. ఆ తర్వాత ఊరూర పల్లెపల్లెలో అస్పృశ్యుల మీద హిందువులు చేసే అత్యాచారాలను, బహిష్కరణలను వారు ఎదుర్కోవలసి వచ్చింది. యావత్ భారతదేశంలో అక్కడక్కడా దీనికి ప్రతిస్పందన కనిపించింది. తరువాత సనాతులంతా కలిసి చావదార్ చెరువును శుద్ధి చేయ్యాలని నిర్ణయించారు. ఆ నిర్ణయం ప్రకారం చావదార్ చెరువులోంచి 108 బిందెల నీళ్ళు తీయించారు. ఇంటింటి నుంచి పేడ, గోమూత్రం పోగుచేసి పాలు, పెరుగు బిందెల్లో కలిపారు. మొత్తం వాటన్నింటిని చావదార్ చెరువులో పోసి, శుద్ధి అయ్యిందని ప్రకటించారు. "మనువాద సమాజంలో మనిషి స్పర్శతో పోల్చితే ఆవుపేడా, గోమూత్రం అధిక పరిశుద్ధంగా ప్రకిటించడంలో మనువాద సమాజంలో అస్పృశ్యుల స్థితి ఎలాంటిదో తెలియజేస్తూంది".

ఈ ఘటన అనంతరం ఆగష్టు 4వ తేదిన మహాడ్ మునిసిపాలిటీ ఒక కొత్త తీర్మానాన్ని అమోదించి గతంలో ప్రకటించిన తీర్మానాన్ని రద్దుచేసుకుంది. ఈ తీర్మానాన్ని అంబేద్కర్ తీవ్రంగా వ్యతిరేకించాడు చవ్‌దార్ చెరువులో సనాతులతో సమానంగా అస్పృశ్యులు హక్కుగా పొందేవరకు పోరాడాలని నిశ్చయించుకున్నాడు. భవిష్యత్ కార్యక్రమాన్ని డిసెంబర్ 25 వ తేదికి పిలుపునిచ్చాడు, ఈ పిలుపును వ్యతిరేకిస్తూ సనాతులు కోర్టుకు వెళ్ళిన బాబాసాహెబు వెనక్కి తగ్గలేదు. ఈ సందర్భంగా బాబాసాహెబ్ మాట్లాడుతూ " చవ్‌దార్ చెరువులోని నీళ్ళు మనం తాగకపోతే మన ప్రాణాలు ఏమీపోవు, అయితే తతిమ్మా జనంలాగా మనమూ మనుషులమే అని వారందరికి చెప్పాలని మనం వాంఛిస్తున్నాం. సమానత్వానికి శ్రీకారం చుట్టడానికే ఈ ఘటన అని ఆయన పేర్కొన్నాడు". ఈ హిందు సమాజాన్ని పునర్నిర్మాణం చేయ్యాలని దానికోసం సమానత్వం, జాతిరహిత సహజం అనేవి మన లక్ష్యాలు కావాలని పిలుపునిచ్చాడు. 1789 మే 5వ తేదిన ఫ్రాన్సులోని బర్సాయ దగ్గర జరిగిన జాతీయసభతో ఈ పరిషత్ సభను పోల్చుతూ "ఫ్రెంచి విప్లవం కోసం వారు ఎలాగు సంఘటితం కావల్సివచ్చిందో అలాగే మనం కూడా సంఘటితం కావాల్సి ఉంది. ఈ సభలో నిర్దేశించబడిన మార్గమే హిందు సమాజపు అభ్యుదయానికి కావలసిన అత్యవసరమైన మార్గం" అని చెప్పాడు. "పుట్టుకరీత్యా అందరూ సమానంగా పుడతారు వారు చనిపోయేదాక సమానంగా ఉండాలి", "మనుస్మృతిని" దగ్ధం చేసేందుకు తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. ఈ తీర్మానానికి పరిషత్‌లో పాల్గొన్న సమాజమంతా ముక్తకంఠంతో అమోదం తెలిపారు. అనుకున్నదే తడువుగా రాత్రి తొమ్మిది గంటలకు ఒక వేదిక మీద " మనుస్మృతిని" దగ్ధం చేశారు. అనంతరం చెరువు విషయంలో మహడ్ మునిసిపాలిటీ తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ ప్రదర్శనను నిర్వహించారు. అనంతరం డాక్టర్ అంబేద్కర్ మహడ్ సబ్‌జడ్జీ ఎదుట "విధించిన నిషేదాజ్ఞలకు" వ్యతిరేకంగా తిరుగులేని వాదన చేశారు. అయన వాదాన్ని ఖండించడం అసంభమయ్యింది. ఫిబ్రవరి 23వ తేదిన జడ్జి ఆ ఆదేశాన్ని రద్దు చేస్తూ తీర్పు నిచ్చాడు. ఈ సందర్భంగా మహాద్‌లో జరిగిన విప్లవం గురించి డా॥ అంబేద్కర్ మాట్లాడుతూ "నోరు వాని లేని పీడిత ప్రజలు, చెప్పుకోదగిన ఏ ఆఘాయిత్యం జరగకుండా, అతి తక్కువ సమయంలో, సమాన హక్కులను పొందడం అన్నది ప్రపంచ చరిత్రలోనే ఎప్పుడూ జరగని, అనుకోని, ఆశించని విప్లవం" అని పేర్కొన్నారు.

అయితే ఈ తొలి దళిత విప్లవ పోరాటానికి నాంది అయిన సంఘటన జరిగి నేటికి 87 సంవత్సరాలు గడిచిపోయింది. స్వాతంత్ర్యం వచ్చి 60 సంవత్సరాలు గడిచిన తర్వాత కూడా కులవివక్షత, అంటరాతనం వివిధ రూపాల్లో నేటికి కోనసాగుతోంది. గతంలో సాక్షి హ్యూమన్ రైట్స్ నిర్వహించిన సర్వేలో నేటికి 74 శాతం గ్రామాల్లో మంచినీటి సేకరణ వద్ద, 86 శాతం గ్రామాల్లో ఆలయ ప్రవేశం విషయంలో, 92 శాతం గ్రామాల్లో ఇళ్ళు అద్దెకు ఇవ్వడం దగ్గర, 54 శాతం గ్రామాల్లో హోటల్ల దగ్గర, 90 గ్రామాల్లో బట్టలుతకడం దగ్గర, 82 శాతం గ్రామాల్లో క్షౌరం దగ్గర వివక్ష కొనసాగుతుందని తెలియజేసింది. వీటి నిర్మూలన కోసం అనేక చట్టాలు వచ్చిన అంటరాని తనాన్ని కానీ, కులవివక్షను కాని అరికట్టలేక పోతున్నాయి. అంబేద్కర్ వారసులమని చెలామని అవుతున్న నాయకులు కాని సంఘాలు కాని వీటికి వ్యతిరేకంగా పోరాటం నిర్వహించలేకపోతున్నాయి. దళితులపేరు చెప్పుకొని దళిత ప్రతినిధులుగా చట్టసభల్లో ఎన్నికయిన నాయకులు చట్టసభల్లో వీటిగురించి పల్లెత్తు మాటైన మాట్లాడకపోవడం దురదృష్టకరం. దళితులను జెండాలు మోసెందుకే కమ్యూనిస్టు పార్టీలు వాడుకుంటున్నాయని విమర్శిస్తున్న నాయకులు, అగ్రవర్ణాల నాయకత్వ చేతుల్లో కమ్యూనిస్టు పార్టీలు ఉన్నాయని విమర్శిస్తున్న నాయకులు, ఆ పార్టీలు కులవివక్ష రూపాలకు వ్యతిరేకంగా అంబేద్కర్ ప్రారంభించిన ఆశయాలను ముందుకు తీసుకపోతూ ఆ సామాజిక రుగ్మతలకు వ్యతిరేకంగా పోరాడుతుంటే విమర్శిస్తున్నారు. అయితే అంబేద్కర్ వారసులుగా చెలామని అవుతున్న నాయకులు కులవివక్షకు వ్యతిరేకంగా ఎలాంటి పోరాటాలు నిర్వహిస్తున్నారో ఓసారి ఆలోచించుకోవాలి. దళితుల వ్యతిరేకంగా ప్రభుత్వాలు అనేక విధానాలు అవలంభిస్తున్నా ప్రభు[illegible] విధానాలను వ్యతిరేకించకుండా ప్రభుత్వాలకు వత్తాసు పలకడ[illegible] ఎంత వరకు సమంజసమో ఆలోచించాలి. గత ఎన్నిక[illegible] సందర్భంలో కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలోకి వస్తే చంద్రబా[illegible] హాయంలో భర్తీకాకుండా మిగిలిపోయిన 60 వేల బ్యాక్‌లా[illegible] పోస్టులను భర్తీచేస్తానని, దళితుల అభివృద్ధికి భూములిస్తాన[illegible] రుణాలిస్తానని హామీలు ఇచ్చి వాటిని విస్మరిస్తూ 5 సంవత్సరా[illegible] పాలనను పూర్తిచేసుకుంటున్న ఒక్కనాడు కూడా ఆనాటి హామీ[illegible] ఎమయ్యాయని కాంగ్రెసు ప్రభుత్వాన్ని ఏ దళిత నాయకు[illegible] నిలదీసిన పాపాన పోలేదు. ఒకవైపు రియల్‌ఎస్టేట్ పేరుతో, సెజ్[illegible] పేరుతో దళితుల భూములను కోకాపేటలో, పోలెపల్లిలో కాంగ్రె[illegible] ప్రభుత్వం లాక్కున్న, దళితులకు బడ్జెట్‌లో రావాల్సిన వాటా[illegible] (ఎస్.సి, ఎస్.టి సబ్ ప్లాన్) దారిమళ్ళిస్తున్నా, జలయజ్ఞం పేరు[illegible] వేలాది కోట్ల రుపాయలు కేటాయింపులు చేస్తున్నా, అసలు భూము[illegible] లేని దళితులకు ఒరిగేదేందని ప్రశ్నించే వారు గాని, పైపెచ[illegible] ప్రాజెక్టుల పేరా వందలాది దళిత గిరిజన భూములు లాక్కుంటు[illegible] అడ్డుకునే వారు కరువయ్యారు. ఓట్లదగ్గర, సీట్లదగ్గర కులా[illegible] వాడుకోనే నాయకులు అంబేద్కర్ వారసులుగా కులవివక్[illegible] అంటరానితనానికి వ్యతిరేకంగా నిర్మించిన పోరాటాల్లో, త[illegible] భాగస్వామ్యం ఎంతో బేరీజువేసుకోవాలి. అంబేద్కర్ వారసులం[illegible] "బోధించు, సమీకరించు, పోరాడు" అనే నినాదాలను ముందుకు[illegible] తీసుకుపోవాల్సిన బాధ్యత,వీటికి వ్యతిరేకంగా పోరాడిల్సిన బాధ్య[illegible] మనందరి మీద ఉంది. అదే డా॥ బి.ఆర్ అంబేద్కర్ నాయకత్వ[illegible] జరిగిన తొలి దళిత విప్లవ పోరాటం ఇచ్చిన పిలుపు.

---

*Cont... 37*

స్నేహశీలత, త్యాగశీలత, వజ్ర సంకల్పం, ప్రజలను ఆకర్షించగత సామార్థ్యమును నేడు తెలంగాణ విద్యార్థి, యువకులు అలవరుచుకోవాలి.

నూరేండ్ల క్రితం పంజాబ్‌లోని ఒక పల్లెటూరులో పుట్టిన ఆ శిశువు ఆ గ్రామాన్నే కాదు. దేశ దేశమంతా, ఒక తరమే కాదు తరతరాలు గర్వంగా చెప్పుకొనే వీరపుత్రుని గురించి నేటి తరం అధ్యయనం చేయాలి. ఉరితాడును ముద్దాడుతూ ఆ శిరస్సు ఇచ్చిన "ఇంక్విలాబ్ జిందాబాద్" అనే నినాదం నేటి తెలంగాణలో ప్రతిధ్వనించాలి. కొమురం భీం, చాకలి అయిలమ్మ, బందగా లాంటి ఉద్యమ రత్నాల పోరుదారిన నడవాలి. భగత్‌సింగ్ 80 వర్ధంతి సందర్భంగా ఆ వీరునికి, దేశం కోసం పోరాడి అసువులు బాసి[illegible] మేధావులకు విప్లవాంజలి ఘటిస్తూ వారి పోరాట స్ఫూర్తిని ఆద[illegible] జీవిత పద్ధతులను దేశభక్తిని పుణికి పుచ్చుకొందాం. అసమానతల[illegible] మరియు ఆత్మగౌరవాల కోసం పోరాట కర్తవ్యాలను తీసుకుందా[illegible] డబ్బుసంచుల సమైక్యాంధ్ర వాద దురహంకారంపై సమరశంక[illegible] పూరిద్దాం. శాంతి, అహింసల పేరుతో కాంగ్రేస్ ఆడే కప[illegible] నాటకాలను కట్టి పెడుదాం. తెలంగాణకై ఉద్యమిద్దాం. తెలంగా[illegible] రాష్ట్ర ప్రక్రియ ప్రారంభించే వరకు కొట్లాడుదాం. తెలంగా[illegible] అమరవీరుల ఆశయాలను సాధించుకుందాం.

*వ్యాసకర్త పి.డి.ఎస్.యు. రాష్ట్ర అధ్యక్షులు*

# క్షుద్ర వినోదంపై పోరాటం

- *రాష్ట్ర ప్రజానీకాన్ని తీవ్రంగా కలవరపెట్టిన ఆయేషా హత్య కేసు నిందితుడు సత్యంబాబు, టీవీల్లో వచ్చే నేరాలు-ఘోరాలు వంటి క్రైం కార్యక్రమాలే తనను నేరం చేసేలా పురికొల్పాయని చెప్పాడు.*
- *కొన్ని నెలల క్రితం హైదరాబాదు శివార్లలో ఒక మహిళను హత్య చేసిన నిందితుడు కూడా పోలీసుల ఇంటరాగేషన్‌లో తానూ టీవిలో క్రైం కార్యక్రమాలు చూసే ఈ హత్యకు ప్రేరణ పొందానని చెప్పాడు.*

గత కొన్నేళ్లుగా తెలుగు టెలివిజన్‌లో కొనసాగుతున్న ఈ క్షుద్ర వినోదం సమాజంపై ఎటువంటి దుష్ప్రభావాన్ని వేస్తుందో ఇంతకు మించిన ఉదాహరణ అక్కర లేదు. రాత్రి తొమ్మిది అయితే చాలు చిన్న పిల్లల మొదలుకొని పెద్దవాళ్ల వరకూ ఏ ఛానెల్‌లో ఏ ఘోరం చూడాల్సి వస్తుందోనని హడలిపోవాల్సిన పరిస్థితులు వచ్చాయి. రాత్రి ఇంట్లో అన్నం తినే వేళకు మనుషులను చంపడాన్ని ఒక వినోదభరితమైన కార్యక్రమంగా మార్చి వడ్డిస్తున్నాయి తెలుగు వార్తా ఛానెళ్లు. ఇక ఈ గొప్ప వినోదం మిస్ కాకండి అంటూ పగలూ రాత్రీ తేడాలేకుండా ప్రకటనలతో ఉదరకొడుతున్నాయి. 24 గంటల నిరంతర వార్తా స్రవంతులు ఇప్పుడు ప్రజలకు నిరంతరం దుర్వార్తలు చూపిస్తున్నాయి. తమ ఛానెల్స్ రేటింగ్ పెరిగితే చాలు అనే ఏకైక లక్ష్యంతో ఎటువంటి గడ్డికరవడానికైనా సిద్ధమైపోతున్నాయి. గత కొంతకాలంగా ఈ క్రైం సీరియళ్లపై ప్రజల నుండి వ్యతిరేకత పెరుగుతోంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఈ సీరియళ్లను నిషేధించాలని కొన్ని విజ్ఞప్తులు కూడా అందాయి. అయితే ఇంకా ప్రభుత్వాలు ఆ దిశగా ఎటువంటి చర్యలు తీసుకోలేదు.

సమాజంలో ఎటువంటి మార్పు రావాలన్నా అది ప్రజల నుండే రావాలి. నేరాన్ని వినోదం చేసిన తెలుగు వార్తా ఛానెళ్ల తీరును ప్రజలు ఇకనైనా గట్టిగా నిరసించాలి. ఇటువంటి కార్యక్రమాలు మాకు వద్దు అని ఛానెళ్ల యాజమాన్యాలకు మనం స్పష్టంగా చెప్పాలి. తీరు మార్చుకోకపోతే ఆయా చానెళ్లను చూడడం మానేస్తామని హెచ్చరించాలి.

ఈ దిశగా మేము చేస్తున్న ప్రయత్నానికి వెన్నుదన్నుగా నిలవండి. మన సమాజం నుండి ఈ క్షుద్ర వినోదాన్ని తరమి కొడదాం పదండి....

**చేయాలనుకుంటున్న కార్యక్రమాలు:**

1) నేరసంబంధ కార్యక్రమాలను తక్షణం ఆపివేయాలని, నేరాలను వినోదంగా మార్చే ప్రయత్నం మానుకోవాలని టీవీ ఛానెళ్ల యజమానులకు ఒక బహిరంగ లేఖ రాస్తున్నాం.
2) ఈ సీరియళ్లను తక్షణమే నిషేధించాల్సిందిగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఒక విజ్ఞప్తి కూడా పంపిస్తున్నాం.
3) ఈ క్రైం సీరియళ్లపై మీడియా విశ్లేషకులు, మేధావులు, జర్నలిస్టులతో ఒక చర్చా కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తున్నాం.
4) టీవి ఛానెళ్ల ఆఫీసుల ముందు వివిధ రూపాల్లో నిరసన తెలియజేయాలని అనుకుంటున్నాం.

ఈ ఉద్యమానికి కేంద్రంగా ఇక తెలుగు బ్లాగును మొదలు పెట్టాము. (http://nenusahitam.blogspot.com). మీ వంతు సాయంగా ఇందులో మీ భావాలు పంచుకోండి. లేదా మీ అభిప్రాయం క్యాంపస్ వాయిస్‌కు రాసి పంపండి.

**నేరం వినోదం కా(రా)దు అనే నినాదంతో ఒక కొత్త ఉద్యమానికి శ్రీకారం చుడదాం రండి.**

